జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు

Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 46 • 9-11-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-




### జగన్ కోపం కట్టలు తెంచుకొంటున్నది

# ప్రభుత్వ పతనానికి మరొక ప్రయత్నం!



తాను జైలు నుంచి బయటకు రాకుండా కాంగ్రెస్ నాయకత్వం చక్రబంధంలో బిగించి వేస్తున్నదనే భావన జగన్‌లో బలీయంగా పెరిగిపోతున్నది. సుప్రీంకోర్టు తీర్పు ఫలితంగా వచ్చే మార్చి నెలాఖరు వరకు కనీసం బెయిల్ కోసం దరఖాస్తు చేసుకొనే అవకాశం లేకుండాపోయింది. సిబిఐ అవలంభించిన కఠిన వైఖరి వల్లనే ఇది జరిగిందనేది జగన్ ఆవేదన. తాను నేరుగా ఢిల్లీ పెద్దలతో సంప్రదింపులు, రాయబారాలు జరిపి, చివరి నిముషంలో సీనియర్ న్యాయవాదిని మార్పించి, సుప్రీంకోర్టులో సులభంగా బెయిల్ లభించే ఏర్పాట్లు చేసుకొన్నా సిబిఐ అధికారులు అడ్డుపడి, అంతా చెడగొట్టారన్నది జగమెరిగిన సత్యం. కాంగ్రెస్ అగ్ర నాయకత్వం, హోంమంత్రి స్థాయి నేతలు తన పట్ల ఏ మాత్రం సానుకూలత చూపి వుండినా సిబిఐ అధికారులు అంత దూరం వెళ్లలేరన్నది జగన్ అభిప్రాయం. కారణం ఏదైనా దాదాపు మరొక ఆరు నెలల పాటు ఆయన జైలులోనే మగ్గక తప్పడం లేదు.

అయితే ఈ జైలు జీవితం అక్కడితో ఆగకుండా మరింతకాలం పొడిగించేందుకు ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరక్టరేట్ ద్వారా ప్రయత్నాలు జరుగుతున్నాయని జగన్ అనుమానిస్తున్నాడు. ఇప్పటివరకు ఇడి అధికారులు కేవలం రెండు ఛార్జిషీట్లును మాత్రమే పరిగణనకు తీసుకొని, కొంతభాగం ఆస్తులు జప్తు చేసి, విచారణ జరుపుతున్నారు. సిబిఐ అధికారులు చెప్తున్నదాన్ని బట్టి మరొక ఏడు ముఖ్యమైన అంశాలపై కొత్తగా ఛార్జిషీట్ వేయవలసి వుంది. దాన్ని కూడా ఇడి అందిపుచ్చుకొని, కేసును మరింత ముందుకు నడిపించే ఉద్దేశంలో కన్పిస్తున్నదని, ఆ కేసుల పేరుతో మరికొంతకాలం తనను జైలులోనే నిర్భందించే కుట్ర జరుగుతున్నదని జగన్ అనుమానిస్తున్నాడు. దీనితో జగన్‌కు కాంగ్రెస్ మీద వుండిన ఆశలన్నీ ఆవిరైపోయాయి. తన తండ్రితో అత్యంత సన్నిహితంగా మెలిగిన కేంద్ర నాయకులు ఎవరో ఒకరు జోక్యం చేసుకొని తనను ఆదుకొంటారన్న నమ్మకం జగన్‌లో పిసరంత వుండేది. అందువల్లనే ఆయన సోనియాగాంధీ తన పట్ల చాలా కోపంతో వున్నారని తెలిసినా చాలాసార్లు రాజీ ప్రయత్నాలు చేశాడు. వచ్చే ఎన్నికల తర్వాత ఢిల్లీలో తాను యుపిఏ ప్రభుత్వాన్ని సమర్థిస్తానని తనంత తానుగా ప్రకటన కూడా చేశాడు. ఒకరకంగా ఆ ప్రకటన కాంగ్రెస్‌తో బహిరంగ రాజీ ప్రతిపాదన వంటిదే. కానీ జైలు నుంచి విముక్తి విషయంలో అవేమీ ఫలించలేదు. ఇప్పుడు ఇడి ధోరణి చూస్తే, ఢిల్లీ పెద్దలెవరూ తన ఆశ్రయానికి రారని రుజువైపోతున్నది. ఆ భావన జగన్‌లో తీవ్రమైన ఆవేదన రగిలిస్తున్నది. కాంగ్రెస్ పట్ల కానీ, ఆ ప్రభుత్వం పట్ల కానీ ఇక ఎంత మాత్రం ఉపేక్ష పనికిరాదన్న నిర్ణయానికి వచ్చేశాడాయన.

రోశయ్య హయాంలో జగన్ కాంగ్రెస్‌లోనే వుండి స్వంత కుంపటి వెలిగించుకొన్న సమయంలో దాదాపు 50 మంది ఎమ్మెల్యేలు ఆయన వెంట నడవడానికి సిద్ధంగా వుండినారు. అప్పట్లోనే అవిశ్వాసం పెట్టి, ప్రభుత్వాన్ని పడగొట్టి వుంటే పరిస్థితి వేరుగా వుండేది. ఆ పాపం చంద్రబాబు మీదకు తోయాలని చేసిన ప్రయత్నాలలో, మెల్లమెల్లగా ఎమ్మెల్యేలు జారుకోవడం మొదలు పెట్టారు. అవిశ్వాసం ఆచరణలోనికి వచ్చేసరికి మిగిలింది కేవలం 16 మంది మాత్రమే. అందువల్ల చంద్రబాబు చేత బలవంతంగా అవిశ్వాసం పెట్టించినా ప్రభుత్వానికి ప్రమాదం కలగలేదు.

ఆ తర్వాత జరిగిన 18 స్థానాల ఉపఎన్నికలు, ఇప్పుడు జరుగుతున్న షర్మిళ పాదయాత్రలతో కాంగ్రెస్ ఎమ్మెల్యేలలో చాలామంది జగన్ వైపు చూస్తున్నారు. రేపటి ఎన్నికలలో టిక్కెట్ ఇస్తామనే సంకేతం ఇస్తే మందలు మందలుగా తన పార్టీలోకి దూకడానికి సిద్ధంగా వున్నారు. వారిలో కొందరిని రాబట్టుకొని, కిరణ్ సర్కారును కూలగొడితే తనకు రాజకీయంగా ప్రయోజనం వుంటుందని జగన్ భావిస్తున్నాడు. కిరణ్ సర్కారు బొటాబొటి మెజార్టీతో నడుస్తున్నది. పదిహేను నుంచి ఇరవై మందిని పక్కకు తప్పించగలిగితే మజ్లిస్ వంటి పార్టీలు అండగా నిలిచినా ప్రభుత్వాన్ని కాపాడలేరు. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని కాంగ్రెస్ నేతలకు బుద్ధి చెప్పాలని జగన్ పథకం రచిస్తున్నట్లు విశ్వసనీయ సమాచారం.

ఇరవై మంది కాంగ్రెస్ ఎమ్మెల్యేలను తన వైపు ఆకర్షించుకోవడానికి జగన్ పెద్దగా కష్టపడవలసిన పని కూడా లేదు. కిరణ్ సర్కారు అపసవ్య విధానాలు, కరెంట్ కోతలు, డీజిల్ ధరల పెంపు, గ్యాస్ సిలిండర్ల మీద సబ్సిడీ ఎత్తివేత వంటివన్నీ కలిసి కాంగ్రెస్ పట్ల జనంలో తీవ్రమైన క్రోధం, ద్వేషం పెంచి వేసినాయి. సమీప భవిష్యత్తులో మన రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ తన రాజకీయ ఉనికిని

కొరవ 14వ పేజీలో

### కిరణ్ కుర్చీ పెరుక్కోవాలని

# కాంగ్రెస్ నేతల కొంగ జపం!

ప్రభుత్వాన్ని పతనం చేయాలని ఒక ప్రక్క వైఎస్‌జగన్ ఎమ్మెల్యేలకు వల విసురుతుంటే, మరొకప్రక్క కిరణ్ కూర్చున్న కుర్చీని తాము పెరుక్కోవాలని కాంగ్రెస్ నేతలు ఢిల్లీలో కొంగ జపం చేస్తున్నారు. రేపటి ఎన్నికల తర్వాత రాష్ట్రంలో కాంగ్రెస్ అనే పార్టీ మిగులుతుందా, ఏ పశ్చిమబెంగాల్ వలెనో పూర్తిగా అదృశ్యమై పోతుందా అన్న భయాందోళనలతో లక్షలాది మంది కార్యకర్తలు అయోమయంతో కొట్టుమిట్టాడుతుంటే, నేతలు మాత్రం కిరణ్‌ను దించి తాము కూర్చోవడం ఎట్లా అన్న పథక రచనలో తలమునకలుగా కాలం గడుపుతున్నారు. విచిత్రం, ఢిల్లీ పెద్దల ఆలోచన కూడా వారికి తగినట్లే వుండడం.

అదేమి దురదృష్టమో కానీ కిరణ్‌కుమార్‌రెడ్డి ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన ప్రక్కరోజు నుంచీ నాయకత్వ మార్పుపై వూహాగానాలు నడుస్తున్నాయి. రెండేళ్ల తర్వాత అవే కొనసాగుతున్నాయి. ఇటీవల జరిగిన కేంద్ర మంత్రివర్గ విస్తరణ తర్వాత ఈ పుకార్లు మరింత జోరందుకొన్నాయి. దేశస్థాయిలో ప్రభుత్వాన్ని క్షాళన చేసి, 2014 ఎన్నికలకు సన్నాహాలు ప్రారంభించిన రాహుల్ బ్రిగేడ్, రాష్ట్రంలోనూ అటువంటి ఏర్పాట్లకు శ్రీకారం చుట్ట వచ్చుననే అంచనాయే ఈ ముమ్మరమైన ప్రయత్నాలకు కారణం. కిరణ్‌కుమార్‌రెడ్డి దురదృష్టమో అదృష్టమో తెలియదు కానీ, ఆయన పదవి చేపట్టిన నాటి నుంచీ, హైదరాబాదు నుంచి ఢిల్లీ వెళ్లే ప్రతి ఒక్క కాంగ్రెస్‌వాదీ కిరణ్ మీద పితూరీలు విన్పించి వస్తున్నారు. కిరణ్‌ను మారిస్తే తప్ప రాష్ట్రంలో పార్టీ బ్రతికి బట్ట కట్టదని చెవిలో ఇల్లుకట్టుకొని పోరుతున్నారు. ఈ రెండేళ్లలో ఒక్కరంటే ఒక్కరు కూడా ఢిల్లీ పెద్దల వద్ద కిరణ్ అనుకూల వాదన విన్పించలేదు. అయితే ఎప్పటికప్పుడు ఏదో ఒక పరిస్థితుల ప్రాబల్యం కిరణ్‌కు శ్రీరామరక్షగా నిలుస్తున్నది. నెల రోజుల క్రితం మార్పు దాదాపు ఖాయం అన్న ప్రచారం జరిగింది. అయితే అప్పుడే సోనియాగాంధీ అల్లుడు రాబర్ట్ వదేరా మీద అవినీతి ఆరోపణలు రావడం, బొగ్గు కుంభకోణంలో సాక్షాత్తు మన్మోహన్‌సింగ్ ప్రమేయంపై విమర్శలు చెలరేగడం, గుజరాత్ ఎన్నికల ప్రక్రియ మొదలు కావడం వంటి కారణాల వల్ల ఆంధ్రప్రదేశ్ మీద మనసు పెట్టే తీరిక, ఓపిక ఢిల్లీ పెద్దలకు లేకుండా పోయాయి. దానితో కిరణ్ బ్రతికిపోయాడు.

ఇప్పుడు మాత్రం ఇక ఆలస్యం జరగదని,

కొరవ 14వ పేజీలో

# ప్రభుత్వ వైఫల్యం

ఆడలేక మద్దెల ఓడని మెటికలు విరిచిందట వెనకటి కొక నాట్యకత్తె. నీలం తుఫాను ఉధృతిని ఎదుర్కోవడం చేతకాక చేతులెత్తేసిన రాష్ట్ర ప్రభుత్వం వాతావరణ శాఖ మీద ఆక్రోశం వెళ్లకక్కడం ఆ తీరునే తలపింప చేస్తున్నది. నీలం తుఫాను మద్రాసుకు ఆవల, మహాబలిపురంలో తీరం దాటేసిందన్న వార్త వినగానే రాష్ట్ర ప్రభుత్వ అధికారులు హాయిగా ఊపిరి పీల్చుకొన్నారు. ముప్పు తప్పింది కాబట్టి ఇక తమకే బాధ్యత లేదని విధుల నుంచి తప్పుకొన్నారు. కానీ తీరం దాటిన తుఫానుతో నిమిత్తం లేకుండా ఉత్తరాంధ్రలో భారీ వానలు కురిశాయి. తుఫాను వెలిసిన తర్వాత అటువంటి వానలు రావడం మామూలే అన్న అలసత్వంతో వుండిపోయారు అందరూ. కానీ రెండంటే రెండు రోజులలో వరుణ దేముడు తన ప్రతాపం చూపించాడు. పశ్చిమగోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలను కుండపోతతో ముంచెత్తాడు. ఆ కుంభవృష్టికి ఒక్కసారిగా వాగులు, వంకలు పొంగి పొర్లాయి. చెరువుల గట్లు తెగాయి. ఆ వరద తాకిడికి రైలు పట్టాలు కదిలిపోయాయి. రోడ్లకు గండ్లు పడ్డాయి. రవాణా స్తంభించింది. పంటలు నీట మునిగాయి.

మనకు వానలు కొత్తకాదు. తుఫాన్లు కొత్త కాదు. ప్రకృతి వైపరీత్యాలు వచ్చినపుడు ఎవరేమి చేయాలో స్పష్టమైన మార్గదర్శకాలున్నాయి. గత అనుభవాలు కూడా వున్నాయి. కానీ ఒక వంక వరుణ దేముడు కుండలతో నీళ్లు క్రుమ్మరిస్తుంటే, మరొకవంక రాష్ట్ర ప్రభుత్వం యావత్తు బొత్సా సత్తిబాబు కుమార్తె వివాహ మహోత్సవంలో మునిగితేలుతూ వున్నది. వానల వల్ల కల్గుతున్న అనర్థాన్ని ఎవరూ అర్థం చేసుకోలేకపోయారు. దానితో ఎటువంటి ముందు జాగ్రత్త చర్యలు చేపట్టడానికి అధికారులు సిద్ధం కాలేకపోయారు. రెవెన్యూ, వ్యవసాయ, నీటి పారుదల, రోడ్లు భవనాలు, పోలీసు శాఖలు సంయుక్తంగా పని చేసినపుడు ప్రకృతి వైపరీత్యాలలో ప్రజలకు ప్రభుత్వ ఉనికి తెలుస్తుంది. జిల్లాల స్థాయిలో కలెక్టర్లు, పైస్థాయిలో రెవెన్యూ కార్యదర్శులు, సహాయ కమిషనర్లు అప్రమత్తంగా వున్నప్పుడే ఈ సమన్వయం వీలౌతుంది. అది లోపించడంతో వానల్లో జనాన్ని పట్టించుకొనేనాథుడే లేకుండా పోయాడు. ఆ లోపాన్ని కప్పి పుచ్చుకోవడానికి వాతావరణ శాఖ ముందుగా అంచనా ఇవ్వకపోవడం వల్లనే తాము అప్రమత్తం కాలేకపోయామని తెల పలుకులు పలుకుతున్నాడు రెవెన్యూ మంత్రి రఘువీరారెడ్డి. వాతావరణ శాఖ వానల తీవ్రతను అంచనా వేయడంలో విఫలమై వుండవచ్చు. కానీ ముందుగా చెప్పినంత మాత్రాన ప్రభుత్వం చేపట్టగల్గిన నివారణ చర్యలు ఏమి వున్నాయి అన్నది ప్రశ్న.

తుఫానుకు, కుంభవృష్టికి తేడా వుంది. తుఫాను పరిస్థితులలో తీర ప్రాంతం నుంచి ప్రజలను ఖాళీ చేయించడం ద్వారా ప్రాణ నష్టం నివారించవచ్చు. కానీ కుంభవృష్టి వల్ల ఏర్పడే వరద తెచ్చే విపత్తులు భిన్నమైనవి. ఉభయగోదావరి జిల్లాలకు అనాదిగా గోదావరి నుంచి వరద బెడద వుంది. అందువల్ల బ్రిటీష్ కాలంలోనే, సర్ ఆర్థర్ కాటన్ వంటివారు మురుగునీటి పారుదల వ్యవస్థను అభివృద్ధి చేశారు. అయితే ఇప్పటి ప్రభుత్వాలు వాటి నిర్వహణ నిర్లక్ష్యం చేసి, వరద వస్తే నీళ్లన్నీ ఇళ్ల మీద, పొలాలపైన పారే పరిస్థితి సృష్టించాయి. మరొకప్రక్క నదీ గర్భాలలో, చెరువు లోతట్టు ప్రాంతాలలో భూ ఆక్రమణలను అనుమతించింది ప్రభుత్వం. అందువల్ల ఆయా నదులకు వరద వచ్చినపుడు ఆస్తి నష్టం పెద్ద ఎత్తున కన్పిస్తున్నది. ఒకవేళ వాతావరణ శాఖ ముందుగా చెప్పి వుండినా, పొలాలలను నీటి ముంపు నుంచి తప్పించగలదా ప్రభుత్వం? పంటలను కాపాడగలదా?? చేతిలో గడ్డపార వున్నా దాహం వేసిన వెంటనే బావి త్రవ్వలేనట్లే, వరద హెచ్చరికలుముందుగానే తెలిసినా మురుగునీటి పారుదల వ్యవస్థ సక్రమంగా లేనపుడు ఎవరు చేయగల్గిందీ ఏదీ లేదు.

జమీన్‌రైతు

అమెరికాను శాండీ తుఫాను ముట్టడిస్తే సాక్షాత్తు అధ్యక్షుడు ఒబామా సహాయ చర్యలలో పాల్గొన్నాడు. న్యూయార్క్ గవర్నర్ తీర ప్రాంతం వెళ్లి స్వయంగా ప్రజల చేత ఇళ్లు ఖాళీ చేయించాడు. ప్రజలకెదురయ్యే విపత్తుల పట్ల ప్రభుత్వాల చిత్తశుద్ధి అంటే అట్లా వుండాలి. వరదలొచ్చేటపుడు విందులు, విహారాలలో విలాసాలనుభవించి, ఆ తర్వాత నిందను ఎవరో ఒకరి మీదకు నెట్టే ప్రభుత్వ నేతలు మాత్రమే మనకున్నారు. అది మన ప్రారబ్దం.

## జనవాణి

### దొడ్ల సుబ్బారెడ్డి దాతృత్వం వెల కట్టలేనిది!

దొడ్ల సుబ్బారెడ్డి గారు పెద్దగా చదువుకోలేకపోయినా విద్య పట్ల ఆయన కున్న ఆసక్తి మూలంగానే స్వగ్రామం మహమ్మదాపురంలో 1960లో సుందర మైన హైస్కూలు, దానికి అనుబంధంగా బాలుర హాస్టల్‌ను కట్టించారు. రాష్ట్రంలో ఎక్కడాలేని విధంగా నెల్లూరు దొడ్ల కౌసల్యమ్మ డిగ్రీ కాలేజిని నిర్మించారు. ప్రజారోగ్యంపై మక్కువతోనే నెల్లూరులో పెద్దాసుపత్రికి రూపకల్పన చేశారు. ఆరోజుల్లోనే మెడికల్ కాలేజి సాధించాలని ఎనలేని ప్రయత్నం చేసి వంద ఎకరాల స్థలాన్ని ముందే సేకరించి పెట్టారు. పెద్దాసుపత్రి ప్రాంగణంలో కట్టబోతున్న మెడికల్ కాలేజికి దొడ్ల సుబ్బారెడ్డి మినహా మరో వ్యక్తి పేరు పెట్టడం సముచితమనిపించుకోదు. ఈ విషయంలో మరో ఆలోచన అనవసరం.

గడ్డం తిరుపాలురెడ్డి మహమ్మదాపురం

### పోస్టల్ సేవలు ఘోరం!

పోస్టల్‌శాఖ సేవలు మరీ ఘోరంగా తయారవుతున్నాయి. నగరంలో పోస్ట్ చేసిన పత్రికను ఇక్కడే ఉండే చిరునామాదారునికి చేర్చను ఆపసోపాలు పడుతున్నారు. పోస్టల్ బ్యాంకు పెడతారని, పోస్టాఫీసు బ్రాంచీలన్నీ అనుసంధానం చేస్తారని దీనివల్ల ఖాతాదారుడు ఎక్కడైనా డబ్బులు డ్రా చేసుకోవచ్చని పత్రికల్లో చదవడమే కాని ఈ సౌకర్యం ఎప్పటికి అందుబాటులో వస్తుందో తెలియదు. బ్రాంచ్ పోస్టాఫీసులకు కంప్యూటర్లు ఇచ్చినా సిబ్బంది సేవలు అంతంత మాత్రమే. డిపాజిట్లపై వడ్డీరేటు ఆకర్షణీయంగా లేకపోవడం, కొరియర్ విధానం వచ్చాక రిజిష్టర్‌పోస్టు చేసేవారు లేకపోవడంతో పోస్టల్‌శాఖ ప్రజాభిమానం కోల్పోయింది. ఆశాఖకు పూర్వ వైభవం తెచ్చేలా పాలకులు, పోస్టల్ ఉద్యోగులు శ్రమించాల్సి ఉంది.

పి.శాంతి నెల్లూరు

### ఇసుక మాఫియాపై అదుపేది?

నెల్లూరులో ఇసుక మాఫియా ఆగడాలు, ఆకృత్యాలు కొనసాగుతూనే ఉన్నాయి. నిబంధనలకు విరుద్ధంగా పెన్నానది గర్భాన్ని తోడేస్తూ ఇసుకను చెన్నైకు స్మగ్లింగ్ చేస్తూనే ఉన్నారు. కలెక్టర్, ఎస్పీలు ఎంత కఠినంగా మాట్లాడినా లంచాలకు అలవాటు పడ్డ రెవెన్యూ, పోలీసు, భూగర్భశాఖాధికారులు ఇసుక మాఫియాకు తోడ్పాటు అందిస్తూనే ఉన్నారు.

కె.భాస్కరరావు కోవూరు

### చిరంజీవికి అభినందనలు!

మెగాస్టార్ చిరంజీవికి కేంద్ర పర్యాటక శాఖామంత్రిగా నియమించడం ఆయన అభిమానులందరినీ ఆనంద పరవశులను చేసింది. ప్రజారాజ్యం పార్టీని

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

18-11-1942
పేజీలు : 8 వెల: అణా

### పాత సంపుటాల్లో....

మనుజులు పొడుగైతే
మనసులు పొడుగులా?
విశ్వదాభి వేమ
వినర రామ

తత్ నైరాశ్య శిష్యుడు మామిడిపూడి వెంకట రంగయ్యా గారు 10వ తేదీ ఆంధ్ర రాష్ట్ర సభా సందర్భంలో నెల్లూరులో మాట్లాడుతూ "స్వరాజ్యం గాంధీ వల్ల, కాంగ్రెస్ వల్ల, ఖద్దరు రాట్నాల వల్ల, సత్యాహింసల వల్ల, సత్యాగ్రహాల వల్ల రాలేదు. బ్రిటీష్ వారి చిక్కుల వల్ల, పరదేశీయుల ఒత్తిడి వల్ల వచ్చింది" అన్నాడు.

అంటే తనకు ఆంధ్రా యూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్ పదవి గూడా యివ్వలేకపోయిన ఈ కాంగ్రెస్ స్వరాజ్యం మాత్రం తేగలగడానికి తాఖత్ వున్నదా అన్నది పంతుల శంక కాబోలు.

కాంగ్రెస్ త్యాగయజ్ఞంలో తనుగానీ, తన కుటుంబం గానీ సమిధి పుల్ల గూడా వేయని, వేయను చేతగాని, ధైర్యంలేని ఆ అదృష్టానికి నోచుకోని విద్యాధికుడనే గర్వంతో విర్రవీగిపొయ్యే ఈ మహాశయుడు కాంగ్రెస్ యొక్క గాంధీ మహాత్ముని యొక్క త్యాగశక్తి సామర్థ్య విశేషాలు ఎట్లా గమనించగలడు లెండి.

లెక్చర్లు కొట్టడం కంటే పూచిక పుల్లెత్తు దేశం కోసరం, అందులోని ఆంధ్ర మాతృభూమి కోసరం పనిజేయని, చేయనొసగని, ఈ మహానుభావుడికి ఒడ్డుపొడుగుజూచి ఆచార్య బిరుదునుజూచి, వైస్‌ఛాన్సలర్ పదవితో వీరిని పూజించలేదని కాంగ్రెస్ మీద అలక కాబోలు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

9-11-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### సిక్కిం మీద చైనా కన్ను!

హిమాలయ పర్వత రాజ్యాలలో ఒకటైన సిక్కింపై గూడా చైనా కన్ను పడింది. ఇండియా, హిమాలయ రాజ్యాలను విడదీయాలని చైనా చేసిన ప్రయత్నాలు విఫలమైనవి. సిక్కిం మహారాజా ప్రస్తుత వివాదంలో ఇండియాను బలపరచడంతో చైనాకు శివమెక్కినట్లున్నది.

సిక్కింపై దాడికి సన్నాహ ప్రయత్నంగా, భూటాన్ సిక్కింల మధ్య గల చుంబీ లోయలో ఒక డివిజన్‌కు పైగా సేనలను చైనా సమీకరించి ఉంది. సిక్కిం సరిహద్దుల చుట్టూ చైనా సైనికులు కందకాలు త్రవ్వుతున్నారు.

### దేశ రక్షణ నిధి

జాతీయ రక్షణ నిధికి నెల్లూరు జిల్లా పలు ప్రాంతాల నుండి నగదు, బంగారం ప్రవాహంగా దూకుతున్నది. ప్రజలు స్వచ్ఛందంగా విరివిగా విరాళాలు జిల్లా కలెక్టరు గారికి పంపుతున్నారు. కొందరు స్టేట్ బ్యాంకులో జమ కట్టుతున్నారు. మరికొందరు నేరుగా ఢిల్లీకి పంపుతున్నారు.

కలెక్టర్ స్టేట్ బ్యాంక్ ప్రారంభం నుండి ఈనాటి వరకు రూ.16,815-83 నగదు; బంగారం 40.5 గ్రాములు, పోస్టాఫీసుకు మనియార్డర్ల ద్వారా రూ.862-70పైసలు చేరాయి.

నిధి సేకరణోద్యమాన్ని సమన్వయపరచి, సక్రమ మార్గంలో నడిపించేందుకు జిల్లా జాతీయ రక్షణ నిధి సేకరణ సంఘమును త్వరలో నెలకొల్పుటకు జిల్లా కలెక్టర్ రాజగోపాల్ ఆలోచిస్తున్నారు.

# నెల్లూరు ముచ్చట్లు

## విశ్లేషకుడు

## వక్ఫ్ కబంధ హస్తాలలో ఎఎస్‌పేట దర్గా?

రాష్ట్రంలో వక్ఫ్ బోర్డు యాజమాన్యాన నడిచే దర్గాలు ఎంతగా దిగేస్తుందేది ముస్లిం ప్రజానీకానికంతటికీ తెలుసు. జిల్లాలో హిందూ – ముస్లిం సమైక్యతకు మారుపేరుగా నిలిచే ఎఎస్‌పేటలోని హజ్రత్ నాయబ్ రసూల్, బీబీజాన్ అమ్మవార్ల దర్గాను వక్ఫ్ బోర్డు స్వాధీనం చేసుకోను సర్వం సిద్ధం చేసుకొన్నట్లు విశ్వసనీయవర్గాల ద్వారా తెలిసింది. ఎఎస్ పేట దర్గా నిర్వహణను నెల్లూరు సబ్ జడ్జి చూస్తున్నారు. దీనివల్లే ఆ దర్గాలో కొన్ని సౌకర్యాలు ఒనగూడాయి. జిల్లాలో ఏ దర్గాలో లేనట్లు ఉచిత అన్నదాన పథకం, ఉచిత బడి నిర్వహణతోపాటు బలవంతపు హుండీ వసూళ్లు లేవు. లెక్కాపక్కా నిర్వహణ బాగుంది. ఇటువంటి దర్గాను వక్ఫ్‌బోర్డు తీసుకొని నాశనం చేయడం మినహా అభివృద్ధి చేయడముండదు. మంత్రి ఆనం రామనారాయణరెడ్డి నియోజకవర్గ పరిధిలోని అనుమసముద్రంపేట మండలంలోనే ఇంత అన్యాయపు ఉత్తర్వులేమిటి స్వామి?

## కసుమూరు మస్తానయ్య హుండీ!

వెంకటాచలం మండలంలోని కసుమూరు మస్తానయ్య దర్గాలో హుండీని వక్ఫ్‌బోర్డు హైదరాబాద్‌లో వేలం వేయగా 95 లక్షల 11వేల రూపాయలకు పాట తెగినట్లు తెలిసింది. గత ఏడాది ఈ పాట 93 లక్షలుగా ఉండింది. నిజామాబాద్ జిల్లాకు చెందిన అజీజ్ ఈ పాట పాడుకున్నట్లు తెలిసింది. నెల్లూరు ముస్లిం సోదరులు ఈ దర్గాకు వెళ్లి ఫాతేహా చెల్లించి రావడమేగానీ పెత్తనం గత దశాబ్ద కాలంగా తెలంగాణా వాసులదే. కాశ్మీర్ నుంచి నెల్లూరు వచ్చిన మస్తానయ్యపై తెలంగాణా ప్రాంతీయుల పెత్తనాన్ని ప్రశ్నించే నెల్లూరీయుడు ఒక్కడూ లేడు. అదే బాధాకరం.

## మార్కెట్‌లో తేగలు!

నవంబరు మొదటి వారంలోనే నెల్లూరు మార్కెట్‌లో తేగలు కనపడుతున్నాయి. అయితే కట్ట రేటే మారింది. ఐదు తేగలున్న కట్ట 15 రూపాయలుగా అమ్ముతున్నారు. గత ఏడాదికి ఈ ఏడాదికి కట్టపై ఐదు రూపాయల పెరుగుదల కనిపిస్తుంది. అన్ని తినుబండారాల రేట్లు పెరిగిన ఈ రోజుల్లో తేగల కట్ట రేటు పెరుగుదలను పెద్దగా చర్చించాల్సిన అవసరం లేదనుకొంటాను.

## తగ్గిన కోడి మాంసం ధర

ఈ మధ్య కిలో 187 రూపాయల వరకు ఆల్‌టైం హైకు అమ్మిన కోడిమాంసం విజయదశమి, బక్రీద్ పండుగల తర్వాత ఒక్కసారిగా కొండ దిగింది. బాయిలర్ కోడి మాంసం కిలో 90 రూపాయలమ్ముతుండగా స్కిన్‌లెస్ మాంసం హోల్‌సేల్ షాపుల్లో కిలో వంద రూపాయలకే దొరుకుతోంది. చికెన్ తినేవాళ్లు రోజా తెచ్చుకొని వండి తినేంతగా తగ్గిపోయింది రేటు. ఆలస్యం అమృతం విష మన్నట్లు తక్కువ రేటు ఎక్కువకాలం ఉండదు కాబట్టి గబాగబా తెచ్చుక తినేయ్యండి.

## నెల్లూరుపై జాలిచూపిన నీలం!

నీలం తుఫాన్ నెల్లూరుపై జాలి చూపిందనాలి. దీనిమూలంగా ప్రకాశం, గుంటూరు, కృష్ణ, ఉభయ గోదావరి జిల్లాలలో కుంభవృష్టి కురిసి అతలాకుతలమై పోయాయి. మరో అల్పపీడనం పుడితేగానీ ఈ యేడాది నెల్లూరులో కుండపోత వర్షం పడేట్లు లేదు. కుండపోత లేకుంటే జిల్లాలోని చెరువులు, కాల్వలు, ప్రాజెక్టులకు జలకళరాదు.

## ఇందిరమ్మ బాటకు సిఎం!

ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి స్వయం సృష్టిత కార్యక్రమం ఇందిరమ్మ బాట డిశంబర్ నెల మొదటి వారంలో నెల్లూరులో ఉండబోతోంది. మూడు రోజులపాటు జిల్లాలోని మూడు రెవిన్యూ డివిజన్లలో ఈ కార్యక్రమం సాగుతుంది. ఎక్కడ ఈ కార్యక్రమం జరుగుతుందనేది ఇంకా ఖరారు కాలేదు. అన్ని ప్రభుత్వ శాఖల్లో మరీ ముఖ్యంగా సంక్షేమ శాఖల్లో పరిస్థితులు మెరుగుపరచుకోమని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి జిల్లా అధికారులతో నిర్వహించిన సమీక్షా సమావేశంలో హెచ్చరించారు.

## మునిసిపల్ మంత్రి

మునిసిపల్ మంత్రి మానుగుంట మహీధర్‌రెడ్డి 4వ తేది నెల్లూరు వచ్చారు. వివేకానందరెడ్డి నెల్లూరు వేణుగోపాల స్వామి దేవస్థానంలో నిర్వహించిన కామధేను కల్పవృక్షం యాగంలో పాల్గొన్న ఆయన అంతకు ముందు కార్పొరేషన్ ఆఫీసులో నెల్లూరు, కావలి, గూడూరు, వెంకటగిరి, ఆత్మకూరు మునిసిపల్ కమిషనర్లతో సమావేశమయ్యారు. నగరంలో పార్కింగ్ స్థలాలు లేకుండా భవనాలు నిర్మిస్తుంటే ఏం చేస్తున్నారని ప్రశ్నించారు. కళ్యాణ మండపాలు, ఫంక్షన్, కమ్యూనిటీ హాళ్లతోపాటు వాణిజ్య భవనాలకు ఉన్న పార్కింగ్ స్థలాలపై తనకు 15 రోజుల్లో నివేదిక ఇవ్వమన్నారు. మునిసిపల్ ఎన్నికల నిర్వహణపై గందరగోళంగానే సమాధానాలిచ్చారాయన.

## అధికారులు ఆలోచించండి!

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి పోలీసులను విమర్శిస్తున్న విషయమై నగరంలో చర్చనీయాంశమయ్యింది. వివేకా మాట వింటుంటే అధికారులు ఘోర తప్పిదాలు చేసినా ఆయన పల్లెత్తు మాట అనడు. ఒక్క మాట వినకపోయినా పూర్వం పనిచేసిన మునిసిపల్ కమిషనర్ ఛార్లెస్ ఉమాపతిలా ఎసిబికి పట్టిస్తాడు. ఒకసారి వివేకానందరెడ్డి బావ కాపువీధిలో చీట్లాడుతుండగా త్రీటౌన్ పోలీసులు పట్టుకెళ్లి విడిచి పెట్టలేదు. అప్పటి హోంమంత్రి దేవేంద్రగౌడ్‌కు రామనారాయణరెడ్డి ఫోన్‌చేస్తే ఆయన అక్కడి ఎస్‌ఐకు స్వయంగా ఫోన్‌చేసి సహాయం చేయమని అడిగి విడుదల చేయించారు. నెల్లూరులో దీర్ఘకాలంగా పనిచేస్తున్న అధికారులకు ఇవన్నీ తెలిసినా పోలీసు అధికారుల సంఘం వివేకాపై పరిమిత విమర్శలకే పరిమితమయ్యింది.

## చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## లక్ష్మీకాంతానికి ఐఏఎస్

అదనపు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతానికి ప్రభుత్వం ఐఏఎస్ హోదా ప్రకటించింది. సబ్ కలెక్టర్‌గా, టిటిడి ప్రత్యేకాధికారిగా పనిచేసిన ఆయన ప్రస్తుతం అదనపు జాయింట్ కలెక్టర్‌గా, ఇన్‌ఛార్జ్ జాయింట్ కలెక్టర్‌గా, కార్పొరేషన్ ప్రత్యేకాధికారిగా వివిధ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. చక్కటి తెలుగులో ఉపన్యసించే కళ ఆయన సొంతం. అలాంటి అధికారికి ఐఏఎస్ ఇవ్వడం పట్ల పలువురు అధికారులు ఆయన్ను అభినందించారు.



నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలోని పాండురంగ అన్నదాన సమాజం నూతన కార్యవర్గం ప్రమాణ స్వీకారోత్సవంలో మాట్లాడుతున్న నగర ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి. వేదికపై రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, సమాజం అధ్యక్షుడు తవ్వా రంగయ్య తదితరులు.

## ఒకే ఒక్కడు!

నెల్లూరు కేంద్రంగా జరిగే ప్రభుత్వ వేడుకలకు ఒకే ఒక ఎమ్మెల్యే ఇటీవల కాలంలో హాజరవుతున్నారు. ఆయనెవరో కాదు; తెలుగుదేశం పార్టీకి చెందిన బీద మస్తాన్‌రావు. అధికారపక్ష ఎమ్మెల్యేలకు రాష్ట్ర అవతరణ దినోత్సవపు వేడుకల్లో పాల్గొనే తీరిక కూడా లేదు. గతంలో వివేకానందరెడ్డి ప్రతి వేడుకకు హాజరయ్యేవాడు. ఇప్పుడాయన ముదిరిపోయాడు.

## భూకంపం

4వ తేదీ సాయంత్రం ఉదయగిరి, ఆత్మకూరు నియోజకవర్గాల్లోని కొన్ని గ్రామాల్లో భూమి స్వల్పంగా కంపించింది. టీవీ ఛానళ్లు నెల్లూరులో భూకంపం అంటూ కొంతసేపు బ్రేకింగ్ న్యూస్‌లు ఇవ్వడంతో బయట ఉన్న నెల్లూరీయులు ఈ విషయమై నెల్లూరులోని తమ బంధువులకు ఫోన్లు చేయడం జరిగింది.

## బ్రాహ్మణ పిల్లలకు స్కాలర్‌షిప్పులు!

పేద బ్రాహ్మణ పిల్లలు ఉన్నత విద్య చదువుకొనే నిమిత్తం నెల్లూరు ట్రంకు రోడ్డులోని తిప్పరాజు వెంకట సుబ్బయ్య సత్రం, పేద బ్రాహ్మణ ఉన్నత విద్యా సహాయ ట్రస్ట్ యాజమాన్యాల నేతృత్వంలో ఐదు లక్షల 60వేల రూపాయల స్కాలర్‌షిప్పులను 4వ తేది మైసూరు దత్తపీఠం చిన్నస్వామి విజయానంద తీర్థ దర్గామిట్టలోని కృష్ణ మందిరంలో అందించారు. డాక్టర్ సర్వేపల్లి అజయ్ కుమార్, డాక్టర్ పిఎస్‌ఆర్‌కె మూర్తి, రాళ్లపల్లి సుబ్బారావు, ఫణిరత్నం నేతృత్వంలో నడిచే పై రెండు సంఘాల తరపున 159 మంది పేద బ్రాహ్మణ విద్యార్థులకు దీనిమూలంగా లబ్ది చేకూరింది. తిప్పరాజు వెంకటసుబ్బయ్య సత్రం మేనేజింగ్ ట్రస్టీగా డాక్టర్ సర్వేపల్లి అజయ్ కుమార్ బాధ్యతలు తీసుకొన్నది మొదలు చాలా అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టాడు. రెండో కంటికి తెలియకుండా స్వంత నిధులు కూడా వెచ్చించారు. డాక్టర్ అజయ్‌కుమార్‌ను దర్గామిట్టలోని కృష్ణ మందిరం బాధ్యతలు సైతం తీసుకోమని మైసూరు గణపతి సచ్చిదానంద స్వామి స్వయంగా కోరారంటే ఆయన మంచితనం ఎక్కడ వరకు ప్రాకిందో అర్థం చేసుకోవచ్చు.

## నెల్లూరు క్లబ్‌పై విజిలెన్స్ విచారణ!

నెల్లూరు దర్గామిట్టలోని నెల్లూరు క్లబ్‌కు ప్రభుత్వం ఇచ్చిన 15 ఎకరాల భూమి దుర్వినియోగం జరిగిందన్న ఆరోపణపై విజిలెన్స్ సిఐ కిషోర్‌బాబు విచారణ ప్రారంభించారు. ఎమ్మార్వో, కార్పొరేషన్ కార్యాలయాలకు వెళ్లి డ్లెకాయిడ్, వివిధ రికార్డులను పరిశీలించారు. ఎపుడో ఎవరో చేసిన తప్పిదాలకు పాపం ఇప్పటి నెల్లూరు క్లబ్ కార్యదర్శి ఇంగ్లీషు విజయకుమార్‌రెడ్డి సమాధా

కొరవ 14వ పేజీలో

# ఆలయ ప్రాంగణాల్లో ప్రకటనల బోర్డులు కూడదు!

## జిఓ జారీచేసిన ప్రభుత్వం!




రాజరాజేశ్వరమ్మ దేవస్థానం బోర్డులో సిఎంఆర్ వ్యాపార ప్రకటన చోటుచేసుకొన్న దృశ్యం.

దైవ ప్రార్థనకు నిలయాలైన దేవాలయాల ప్రాంగణాల్లో ఇటీవల ఫ్లెక్సీలు, బ్యానర్లు, కటౌట్లు, ప్రకటనల సంస్కృతి ఎక్కువయ్యింది. నెల్లూరు దేవాలయాల ప్రాంగణాలలో అయితే ఆయా దేవతలను మించి చోటా, బడా నాయకులకు శుభాకాంక్షలందిస్తూ ఉత్సవ వివరాలు తెలియజేస్తూ, పాలకవర్గ సభ్యులు, చివరకు ఇఓ ఫోటోలతో వెలుస్తున్న ఫ్లెక్సీలతో ఆధ్యాత్మిక వాతావరణం మటుమాయమవుతుంది. వీటి ఏర్పాటుకు కొన్ని పాలకవర్గాలైతే దేవాలయాల్లోని హుండీల డబ్బు మంచి నీళ్లలా ఖర్చు పెడుతున్నాయి. ఇటువంటి వ్యవహారాలపై ప్రభుత్వానికి కుప్పలు తెప్పలుగా ఫిర్యాదులందడంతో ప్రభుత్వం కూడా ఆలోచనలో పడింది. ఈ వ్యవహారాలన్నింటికీ ఫుల్‌స్టాప్ పెడుతూ దేవాదాయ శాఖ ప్రిన్సిపాల్ సెక్రటరీ చిత్రా రామచంద్రన్ అక్టోబర్ 20వ తేది జిఓ జారీ చేశారు. ఇక నుంచి దేవాలయ ప్రాంగణాల లోపలా, వెలుపలా ఎటువంటి ఫ్లెక్సీలు ఉండరాదని, పత్రికల్లో దేవాలయాలకు సంబంధించిన ప్రకటనలు విడుదల చేయరాదని, బ్యానర్లు కూడా కట్టకూడదని ఆ జిఓలో స్పష్టం చేశారు. ఎండోమెంట్ కమిషనర్ బలరామయ్యను తన ఉత్తర్వు అమలయ్యేలా చూడమని ఆదేశించారామె. దేవాదాయ శాఖ పరిధిలోనికి వచ్చే నెల్లూరులోని అన్ని దేవాలయాల్లో ఈ ప్రకటనలు, ప్రచారానికి ఏడాదికి లక్షలాది రూపాయలు ఖర్చు పెట్టినట్లు చూపించి ఆ డబ్బు స్వాహాచేసే ప్రబుద్ధులున్నారు. రాజరాజేశ్వరమ్మ దేవస్థానానికి లక్షలాది రూపాయలు ఆదాయమున్నా చందన బ్రదర్స్, సత్యభామ శిల్క్స్ ప్రచారపు బోర్డులతో దేవస్థానం బోర్డు తయారుకావడం ఈ ప్రచార కండూతీకి పరాకాష్టగా చెప్పుకోవచ్చు. నగరంలో దేవాలయాల్లో అనవసర పెత్తనం చేస్తూ ప్రచారంలో వెలిగిపోయే త్రిమూర్తులకు చిత్రా రామచంద్రన్ ఉత్తర్వు బాధ పెడుతుందనాలి. ఈ ఉత్తర్వును దేవస్థానాల కార్య నిర్వహణాధికారులు ఏ విధంగా అమలు చేస్తారో చూడాలి మరి.

# 108 వాహనాలకు ఏసి సౌకర్యం!

## సహకరిస్తానని ముందుకొచ్చిన ఎస్పీ

జిల్లావ్యాప్తంగా ప్రస్తుతం నడుస్తున్న 108 అంబులెన్స్‌లకు ఏసి సౌకర్యం ఏర్పాటుకు తన వంతు కృషి చేస్తానని ఎస్పీ బి.వి.రమణకుమార్ చెప్పారు. నవంబర్ 1వ తేది జిల్లాకు ప్రభుత్వం కొత్తగా కేటాయించిన 108 అంబులెన్స్ ఏసి వాహనాన్ని కలెక్టర్, ఎస్పీలు కస్తూరిబా కళాక్షేత్రంలో సంయుక్తంగా ప్రారంభించారు. ఈ సందర్భంగా ఎస్పీ



ఎసి 108ను ప్రారంభిస్తున్న ఎస్పీ బి.వి.రమణకుమార్.

మాట్లాడుతూ జిల్లాలో తిరుగుతున్న మిగతా 108 వాహనాలకు ఏసి సౌకర్యం కల్పనకు ఎంత ఖర్చవుతుందో ప్రతిపాదనలు తనకివ్వమని 108 నెల్లూరు రీజనల్ మేనేజర్ రాజేంద్రనాయుడును సూచించారు. కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ 108 సేవలను ప్రజలు విరివిగా వినియోగించుకోమన్నారు. గర్భవతులకు సైతం వీటితో సేవలందిస్తామన్నారు. ఎజెసి లక్ష్మీకాంతం, డిఎంఅండ్‌హెచ్‌ఓ డాక్టర్ మాసిలామణి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

# కౌలు రైతులకు వంద కోట్ల రూపాయలు!

## రాష్ట్రావతరణ దినోత్సవ సభలో కలెక్టర్



పొట్టిశ్రీరాములు చిత్రపటానికి నివాళులర్పిస్తున్న కలెక్టర్.

రాష్ట్రావతరణ దినోత్సవ వేడుకలు నవంబర్ 1వ తేది కస్తూరిబా కళాక్షేత్రంలో ఘనంగా జరిగాయి. జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి జాతీయ జెండాను ఆవిష్కరించి పోలీసు గౌరవ వందనాన్ని స్వీకరించారు. నీలం తుఫాను మూలంగా ఈ వేడుకలను పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో కాకుండా కస్తూరిబా కళాక్షేత్రంలో నిర్వహించారు. ఈ సందర్భంగా అమరజీవి పొట్టిశ్రీరాములు విగ్రహానికి పూలమాలవేసి నివాళులర్పించిన కలెక్టర్ మాట్లాడుతూ ఈ ఆర్థిక సంవత్సరంలో జిల్లాలో లక్ష మంది కౌలు రైతులకు వంద కోట్ల రూపాయల మేర రుణాలు పంపిణీని లక్ష్యంగా పెట్టుకున్నామన్నారు. జిల్లాలో రబీ సీజన్‌లో దాదాపు ఐదు లక్షల ఎకరాల విస్తీర్ణంలో పంటలు పండించేందుకు ప్రణాళికలు రూపొందించామన్నారు. ఈ ఏడాది 50 శాతం సబ్సిడీతో ఎరువులు, విత్తనాలు రైతులకు పంపిణీ చేసేందుకు చర్యలు చేపట్టామన్నారు. జిల్లా ప్రజల చిరకాల స్వప్నమైన మెడికల్ కాలేజీని 362 కోట్ల రూపాయల వ్యయంతో, 150 సీట్లతో వచ్చే విద్యా సంవత్సరం నుంచి నెల్లూరులో ప్రారంభించేందుకు అన్ని చర్యలు తీసుకొంటున్నామన్నారు. రైతులు పండిస్తున్న ధాన్యానికి మద్దతు ధర వచ్చేలా ఈ సీజన్‌లో జిల్లాలో 150 ధాన్యం కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేస్తామన్నారు. జలయజ్ఞంలో భాగంగా జరుగుతున్న సంగం, నెల్లూరు బ్యారేజి పనులు చురుకుగా సాగుతున్నాయన్నారు. మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం ద్వారా ప్రస్తుతం రోజువారీ కూలీ రేటు 137 రూపాయలు చెల్లిస్తున్నట్లు చెప్పారు. ఆరోగ్య శ్రీ పథకం ద్వారా ఇప్పటివరకు 2.90 లక్షల మందికి 227.18 కోట్ల ఖర్చుతో వైద్యసేవలు అందించామన్నారు. ఎస్పీ రమణకుమార్, ఇన్‌ఛార్జ్ జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం, డిఆర్వో రామిరెడ్డి, కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు ఈ వేడుకల్లో పాల్గొన్నారు.

# భారంగా... కష్టంగా మీ సేవ!



సర్టిఫికేట్ల కోసం మీ సేవ కార్యాలయం క్యూలో విద్యార్థులు.

## ● కులం, ఆదాయం, నివాస ధృవీకరణ సర్టిఫికేట్లకు రూ.105 చెల్లించాలి

ప్రజలకు ప్రభుత్వపరంగా అందాల్సిన వివిధ సేవలను అందుబాటులోనికి తెచ్చేందుకు ఏర్పాటుచేసిన మీ సేవ ప్రజలకు భారమైన సేవగా, కష్టమైన సేవగా మారుతోంది. మీ సేవ కేంద్రాలకు ఇబ్బడిముబ్బడిగా అనుమతిచ్చి ఏర్పాటు చేయిస్తున్న ప్రభుత్వం లోగోలో సులభంగా... వేగంగా అన్న ట్యాగ్ లైన్‌ను పెట్టింది. మీ సేవ కేంద్రాలకు వచ్చే వినియోగదారులకు మాత్రం సులభంగా వేగంగా కాకుండా భారంగా... కష్టంగా మారిందనే అభిప్రాయం పలువురిలో వ్యక్తమవుతోంది. ప్రభుత్వ ఉద్దేశం ఏదైనప్పటికీ వీటి అమలు మాత్రం నిర్దేశించిన విధంగా సాగడం లేదు. వివిధ ధృవీకరణ పత్రాల కోసం వచ్చే వారికి సాంకేతికంగా ఇబ్బందులు ఎదురౌతుండడంతో గంటల తరబడి నిరీక్షించాల్సిన పరిస్థితులు ఎదురౌతున్నాయి. మీ సేవ కేంద్రాలలోని సర్వర్‌లు చాలా ఆలస్యంగా పని చేస్తుండడంతో వివిధ పత్రాలు, ఇతరత్రా సేవలు పొందేందుకు వచ్చేవారు ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుంది. వివిధ ధృవీకరణ పత్రాల కోసం 35 రూపాయల వరకు రుసుం క్రింద చెల్లించాల్సి వస్తోంది. ముఖ్యంగా విద్యార్థులు స్కాలర్‌షిప్పుల దరఖాస్తు చేసుకొనేందుకు ఆదాయ, కుల, నివాస ధృవీకరణ పత్రాలను అందజేయాల్సి ఉంటుంది. అందుకోసం ప్రతి ధృవీకరణ పత్రానికి 35 రూపాయల లెక్కన మూడింటికి కలిపి 105 రూపాయలు చెల్లించాల్సి రావడంతో పేదవారికి అది ఇబ్బందిగానే పరిణమిస్తోంది. వీటిని తహశీల్దార్ కార్యాలయాల్లో ఉచితంగా అందుకొనే వారికి, మీ సేవ కేంద్రాల్లో వీటి భారం పడుతోంది. అలాగే అడంగళ్ కాపీల కోసం మీ సేవ కేంద్రాలకు వస్తే తీవ్ర జాప్యం జరుగుతుండడంతో ఇబ్బంది పడాల్సి వస్తోందని రైతులు వాపోతున్నారు. దరఖాస్తుదారు ఎవరైనా ప్రభుత్వపరంగా సర్వే చేయించుకోవాలంటే 250 రూపాయలకు ట్రెజరీలో చలానా వ్రాయించుకొని బ్యాంక్‌లో కడితే సర్వేయర్‌లు వచ్చేవాళ్లు. ఇప్పుడు మీ సేవా ద్వారా భూమిని సర్వే చేయించుకోవాలంటే వింత అనుభవాలు ఎదురౌతున్నాయి. రైతులకు దరఖాస్తుదారుడు భూమికి చుట్టుప్రక్కల గల సరిహద్దుల్ని రికార్డులపరంగా ఉన్నట్లు స్పష్టంగా పేర్కొనాల్సి రావడంతో కష్టంగా వుంది. ఇక విద్యుత్ కోతలు మరింత ఆలస్యానికి కారణమవుతున్నాయి. సేవల సంగతి అటుంచితే మీ సేవ కేంద్రాలు కష్టతరంగా, వ్యయభారంగా మారుతున్నాయి.

# దుకాణాల పేరుతో దేవాదాయశాఖ దండకాలు!

దేవస్థానం స్థలంలో దుకాణాలను నిర్మించి ఇస్తామని చెప్పి వేలం పాటల పేరుతో లక్షలు కట్టించుకొని ఆ సంగతే మరచిన వైనం గూడూరులో చోటు చేసుకొంది. స్థానిక శ్రీ ప్రసన్న వెంకటేశ్వరస్వామి ఆలయం స్థలంలో 24 అంగళ్లను నిర్మించేందుకు దేవాదాయశాఖ ఈ ఏడాది జనవరిలో టెండర్లు పిలిచింది. అందుకుగాను వేలంలో పాల్గొనే వారు 3లక్షల రూపాయలను డిపాజిట్ చేయాల్సిందిగా షరతు విధించారు. అధికసంఖ్యలో ఈ పాటలో పాల్గొని ధరావత్తు సొమ్ము చెల్లించడమేకాక నెలసరి అద్దెకు పెట్టిన పాటలోనూ పాల్గొన్నారు. రోడ్డు ప్రక్కన వున్న దుకాణాలకు నెలసరి అద్దె 20 నుంచి 25 వేల రూపాయలుగా, వెనుకవైపు వున్న షాపులకు, మిద్దెపైన ఏర్పాటయ్యే షాపులకు 5నుంచి 15వేల రూపా

### పది నెలలుగా పనిలో ప్రగతి లేదు

యలు అద్దెగా నిర్ణయించగా వేలంలో పాల్గొన్నవారు వాటిని దక్కించుకొన్నారు. ఆనాటి నుంచి ఆరు నెలల్లో నిర్మాణాలు పూర్తి చేసిస్తామని దేవాదాయశాఖ అధికారులు తెలిపారు. కానీ ఆనాటి నుంచి దాదాపు 10 నెలలు గడుస్తున్నా ఇంతవరకు ఆ స్థలంలో దేవాదాయశాఖ ఒక్క రాయి పెట్టలేదు. దీంతో అధిక వడ్డీలకు అప్పుతెచ్చి లక్షల రూపాయలు డిపాజిట్‌గా చెల్లించి వేలంలో అంగళ్లను దక్కించుకొన్న వారు లబోదిబోమంటున్నారు. వడ్డీలు కట్టలేకపోతున్నామని, అసలు అంగళ్లు ఎప్పుడు పూర్తి చేసిస్తారో తెలపాలని దేవాదాయశాఖ అధికారిని కోరగా వేలం జరిగినప్పుడు వున్న అధికారి బదిలీపై వెళ్లాడు, నేను కొత్తగా వచ్చాను నాకేమీ తెలియదని చెప్పడంపై దుకాణాలను దక్కించుకొన్నవారు దిక్కుతోచని స్థితిలో పడిపోయారు. కొందరు వీరికి కేటాయించిన స్థలంలో అంగళ్లు నిర్మించుకొనేందుకు యత్నించగా అధికారులు వారిపై పోలీస్ స్టేషన్‌లో కేసులు పెట్టడం వివాదాస్పదమైంది. దీనిపై పోలీసులకు తమకు జరిగిన అన్యాయాన్ని తెలపడంతో అసలు రంగు బయటపడింది. దీనిపై విచారిస్తే అసలు దేవాదాయశాఖకు భవన సముదాయం నిర్మించుకొనేందుకు అనుమతి లభించలేదని తెలిసింది. దీంతో గగ్గోలు రేగడంతో వ్యాపారులు ఆందోళనకు సిద్ధపడగా వారు చెల్లించిన మొత్తాలను తిరిగి చెల్లించేందుకు వ్యవధి కోరినట్లు సమాచారం. రాజకీయ అండదండలున్న వారు తమ సొమ్మును రాబట్టుకొనగా, మరికొందరు ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేసేందుకు సిద్ధమౌతున్నారు.

# పాఠశాలలోని కంప్యూటర్ల దొంగతనం

### వింజమూరు జడ్పీ పాఠశాలలో దసరా సెలవుల్లో దొంగలు పడ్డారు

వింజమూరు జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాలలో దొంగతనం జరిగింది. పాఠశాలలో విద్యార్థులకు కంప్యూటర్ విజ్ఞానాన్ని అందించడానికి ప్రభుత్వం అందజేసిన కంప్యూటర్లను దొంగలు తస్కరించారు. దసరా సెలవుల అనంతరం పాఠశాల తెరచిన సందర్భంలో పాఠశాలలో గల 22 కంప్యూటర్లు దొంగతనానికి గురి కావడాన్ని గమనించిన ప్రధానోపాధ్యాయుడు బుజ్జయ్యనాయుడు పోలీసులకు సమాచారం అందించడంతో విషయం వెలుగు చూసింది. పాఠశాల గురించి, కంప్యూటర్ల గురించి బాగా తెలిసిన వారే ఈ దొంగతనానికి పాల్పడి వుంటారని పోలీసులు అనుమానిస్తున్నారు. అలాగే పాఠశాల ఆవరణలో మద్యం బాటిళ్లు, పేకముక్కలు పడి వుంటుండడంపై సిబ్బంది ఆందోళన చెందుతున్నారు. సెలవుల్లో త్రాగుబోతులు పాఠశాలను తమ అడ్డాగా చేసుకొని తమ కార్యకలాపాలు కొనసాగిస్తుండడం, జూదం ఆడుతుండడం పైనా పోలీసులకు ఫిర్యాదు చేశారు. పాఠశాల సిబ్బంది నిర్లక్ష్యం మూలంగానే కంప్యూటర్లు దొంగతనానికి గురయ్యాయని విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

• కావలిలో చెత్త పేరుకుపోవడంపై

# ఆర్డీఓ కారాలు, మిరియాలు!

కావలి పట్టణంలో పారిశుధ్యం రోజు రోజుకు క్షీణిస్తుండడం, పరిసరాలు అపరిశుభ్రంగా మారుతుండడంపై ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యంరెడ్డి తీవ్రంగా స్పందించారు. పట్టణంలో పలు ప్రాంతాల్లో కలియ తిరిగిన ఆయన ఎక్కడపడితే అక్కడ చెత్తాచెదారాలు కుప్పలుగా పడివుండడంపై మునిసిపాలిటీ సిబ్బందిపై మండిపడ్డారు. అసలే అస్తవ్యస్తంగా వున్న పట్టణంలో వర్షాల కారణంగా చెత్త, డ్రైనేజి నీరు కలిసి నడవడానికే ఇబ్బందిగా మారింది. దీనిపై ప్రజలు ఆర్‌డిఓ దృష్టికి తీసుకొనిపోవడంతో స్పందించిన ఆయన పలు ప్రాంతాలను పరిశీలించారు. ఎప్పటికప్పుడు చెత్తను శుభ్రం చేయాలని లేకపోతే చర్యలు తప్పవని పారిశుధ్య సిబ్బందిని హెచ్చరించారు. ట్రంకురోడ్డులోగల వ్యాపారులు చెత్తను ఎక్కడంటే అక్కడ పారవేయడాన్ని గమనించి వారిని మందలించారు. మరొకసారి ఇలా చేస్తే ఆ చెత్తను ఎత్తించి మీ అంగళ్లలోనే వేయిస్తానని హెచ్చరించారు. ఆర్టీసి బస్టాండును పరిశీలించిన ఆయన అపరిశుభ్రంగా వున్న బస్టాండు పరిసరాలను గమనించి అధికారులతో మాట్లాడారు. పందుల సంచారాన్ని, డ్రైనేజి నీరు ప్రవహించడాన్ని అరికట్టాలన్నారు. బస్టాండు ఆవరణలోగల

### టౌనంతా కలియ తిరిగాడు

హోటల్‌ను తనిఖీచేసి అక్కడ అస్తవ్యస్త పరిస్థితులు వుండడంపై ఆగ్రహించారు. హోటల్ యజమానికి నోటీసు ఇచ్చి దానిని మూయించి వేయాలని మున్సిపల్ కమిషనర్ నిరంజన్‌రెడ్డిని ఆదేశించారు. మద్యం సీసాలు తెచ్చి బస్టాండులో పడవేయడాన్ని గమనించి ఎక్సైజ్ అధికారులతో మాట్లాడారు. బహిరంగ ప్రదేశాల్లో మద్యం సేవించకుండా చూడాలని ఆదేశించారు.

# వికలాంగులను ఆదుకొంటాం

### గూడూరు సబ్ కలెక్టర్ భరోసా


వికలాంగులకు ఉపకరణాలు అందజేస్తున్న సబ్‌కలెక్టర్ నివాస్.

వికలాంగులకు అన్నివిధాల అండదండలు అందిస్తామని, ప్రభుత్వం చేపట్టిన పథకాలు వారికి సక్రమంగా అందేలా చూస్తామని గూడూరు సబ్ కలెక్టర్ నివాస్ తెలిపారు. నవంబర్ 2న గూడూరు సబ్ కలెక్టర్ కార్యాలయం ఆవరణలో వికలాంగులకు మూడు చక్రాల సైకిళ్లు, కుర్చీలను, బదిరులకు వినికిడి యంత్రాలను పంపిణీ చేశారు. వికలాంగ సంక్షేమశాఖ ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమంలో పాల్గొన్న సబ్ కలెక్టర్ మాట్లాడుతూ ప్రతిభావంతులైన వికలాంగులను గుర్తించి వారికి అన్నివిధాల తోడ్పాటునందించడమే ప్రభుత్వ లక్ష్యమన్నారు. హైదరాబాదు సెంట్రల్ యూనివర్శిటీలో పిజి చేస్తున్న మోహన్ అనే అంధ విద్యార్థికి 25వేల రూపాయలు విలువ చేసే ల్యాప్‌టాప్‌ను ఆయన అందజేశారు. గూడూరు డివిజన్ స్థాయిలో ఏర్పాటుచేసిన ఈ కార్యక్రమానికి అధికసంఖ్యలో వికలాంగులు పాల్గొనడంపై సబ్‌కలెక్టర్ స్పందిస్తూ గూడూరు పట్టణ, మండల పరిధిలోని వికలాంగులను గుర్తించి వీరికి అవసరమైన పరికరాలను త్వరలోనే అందజేస్తామన్నారు. ఈ కార్యక్రమంలో తహశీల్దార్ మైత్రేయ, ఎంపిడిఓ నిర్మలాదేవి తదితరులు పాల్గొన్నారు.

# జననేత ఎర్రం నాయుడు!

### కావలిలో తెలుగు తమ్ముళ్ల నివాళి

సాధారణ కార్యకర్త స్థాయి నుంచి జాతీయ స్థాయికి ఎదిగిన ప్రజానేత ఎర్రంనాయుడని తెలుగుదేశం పార్టీ నివాళులు అర్పించింది. ఎర్రం నాయుడు ఆకస్మిక మృతిపై కావలి పట్టణంలో టిడిపి నేతలు దిగ్భ్రాంతి వ్యక్తం చేశారు. ఈ సందర్భంగా స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు మాట్లాడుతూ ఎర్రన్న మృతి తెలుగుదేశం పార్టీకి తీరనిలోటని అన్నారు. రాష్ట్రంలోనే కాకుండా దేశంలోనే మంచి నేతగా గుర్తింపు పొందాడన్నారు. తెలుగుదేశం పార్టీ పట్ల విధేయుడిగా, ప్రజలతో మమేకమైన నేతగా ఎర్రన్న పేరుగడించారని నివాళులు అర్పించారు. పట్టణంతోపాటు కావలి, బోగోలు, దగదర్తి మండలాల్లోను ఎర్రం నాయుడు మృతికి తెలుగుదేశం పార్టీ కార్యకర్తలు ఘన నివాళులు అర్పించారు.

• ఇస్కపల్లి

# మత్స్యకారులకు నష్టం!

### నీలం తుఫాను చేసిన గాయం


వలలు, బోటు మోటర్లను లైట్‌హౌస్ దగ్గర భద్రపరుచుకున్న మత్స్యకారులు.

నీలం తుఫాను ప్రభావంతో అల్లూరు మండలం ఇస్కపల్లి పంచాయితీలోని పట్టపుపాళెంలో నష్టం సంభవించింది. తుఫాను కారణంగా అలలు ఉధృతి పెరగడంతో సమీపంలో చేపలను ఎండబెట్టుకొనేందుకు నిర్మించిన ప్లాట్‌ఫాం పూర్తిగా ధ్వంసమైపోయింది. ఉప్పు రైతులకు తీవ్ర నష్టాన్ని కల్గించింది. అసలే అంతంతమాత్రంగా వున్న ఉప్పు ఉత్పత్తిదారుల పరిస్థితి నీలం తుఫాను దెబ్బకు మరింత దిగజారిపోయింది. ఈదురుగాలులు, వర్షం కారణంగా వాతావరణంలో మార్పు రావడంతో పెనుప్రమాదం సంభవిస్తుందని మత్స్యకారులు ఆందోళన చెందారు. అయితే ముందు జాగ్రత్తగా అధికారులు అన్ని ఏర్పాట్లు చేయడం, జిల్లాపై తుఫాను ప్రభావం పెద్దగా లేకపోవడంతో సమీప ప్రాంతాల్లోని ప్రజలు ఊపిరి పీల్చుకొన్నారు. వర్షాలు కురవడంతో అల్లూరు పంచాయితీలోని బిసి కాలనీ పూర్తిగా నీటమునిగింది. దీంతో అధిక సంఖ్యలో ప్రజలు ప్రభుత్వ ఆరోగ్య కేంద్రం, తహశీల్దార్ కార్యాలయంలో తలదాచుకోవాల్సి వచ్చింది. ఇస్కపల్లి పట్టపుపాళెంలోని చేపల ఎండబెట్టె ప్లాట్‌ఫామ్‌ను భారీ అలలు కోసిపారేశాయి. ఇదిచూసి మత్స్యకారులు ఆందోళనకు గురయ్యారు. అలాగే విడవలూరు మండలంలోని ఊటుకూరు, రామతీర్థం, పెద్దపాళెం, లక్ష్మీపురం, రామచంద్రాపురం, కొత్తూరు ప్రాంతాల్లోని మత్స్యకారులు ఆందోళనకు గురయ్యారు. వీరిని అధికారులు సురక్షిత ప్రాంతాలకు తరలించారు. అయితే చాలా ప్రాంతాల్లో గాలులకు చెట్లు కూలిపోవడంతో రాకపోకలకు ఆటంకాలు ఎదురయ్యాయి.

# అడ్రస్‌లేని ఆధార్ కార్డులు

ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా చేపట్టిన ఆధార్ కార్డుల పంపిణీ అస్తవ్యస్తంగా మారింది ముత్తుకూరు మండలంలో. చాలా మందికి ఆధార్‌కార్డులు ఇంకా తీయకపోగా, తీసినవారికి ఇంతవరకు ఆ కార్డులు అందకపోవడంతో ప్రజలు గగ్గోలు పెడుతున్నారు. మండలంలో సగానికిపైగా జనాభాకు ఆధార్‌కార్డులు అందలేదు. కేంద్రాలను ఏర్పాటుచేసి కార్డుల

**ముత్తుకూరులో గగ్గోలు పెడుతున్న ప్రజలు**

కోసం ఫోటోలు తీసి నెలలు గడుస్తున్నా ఇంతవరకు అందకపోవడంపై విమర్శలు వస్తున్నాయి. మరోవైపు పోస్టాఫీసుల్లో కుప్పలు తెప్పలుగా ఆధార్‌కార్డులు వుండడం, వీటిని సక్రమంగా బట్వాడా చేయకపోవడంతో కార్డుల పంపిణీ గందరగోళంగా మారింది. చేసేదిలేక పలువురు తమ ఆధార్‌కార్డుల కోసం పోస్టాఫీసు వద్దకే వెళ్లి విచారించాల్సిన పరిస్థితి ఏర్పడింది. మరోవైపు ఇటీవల చేపట్టిన బయోమెట్రిక్ సర్వే అబంధరగా మారింది.




దేనికైనా రెడీ, బ్రాహ్మణిజం చిత్రాలను నిషేధించాలని కోరుతూ కావలి బ్రాహ్మణ మహాసభ నేతృత్వంలో జరిగిన ర్యాలీ.

● వెంకటగిరిలో రేషన్‌కార్డుల రద్దు దరిమిలా...

# గ్యాస్ సిలిండర్ల వినియోగదారుల విలవిల!

ఉన్న రేషన్‌కార్డులను రద్దు చేయడం, మరోవైపు గ్యాస్ కనెక్షన్ విషయంలో ప్రభుత్వ ఆదేశాల మేరకు ఏజన్సీలు రేషన్‌కార్డులను తీసుకరావాలని కోరడంతో చిక్కుల్లోచ్చి పడ్డాయి వినియోగదారులకు. బోగస్ రేషన్‌కార్డుల ఏరివేతలో అర్హులైన వారి కార్డులను డబుల్ ఎంట్రీ పేరుతో రద్దు చేసి పారేశారు రెవెన్యూ అధికారులు. అన్ని ప్రాంతాల్లో ఇలాగే జరిగింది. వెంకటగిరిలోను దాదాపు రెండు వేలకు పైగా రేషన్‌కార్డులను రద్దు చేశారు. ఈ కార్డులన్ని 2005లో రెవెన్యూశాఖ జారీ చేసిన కార్డులే. 2010 జూన్ నుంచి డబుల్ ఎంట్రీ పేరుతో అర్హులైన వారి కార్డులు రద్దు చేయడంతో లబోదిబోమంటూ జిల్లా కలెక్టర్‌ను కలిసి విన్నవించుకొన్నారు. ఆయన చౌకదుకాణాల్లో సరుకులు ఇవ్వమని ఆదేశాలు జారీ చేయడంతో వినియోగదారులు రేషన్ అందుకొంటున్నారు. రెండు మూడు నెలల క్రిందట సరుకుల పంపిణీకి కూపన్లు ఇచ్చారు. అవి అక్టోబర్ నెలకు పూర్తయ్యాయి. నవంబర్ నెలలో తిరిగి కొత్త రేషన్ కార్డులు ఇచ్చేందుకు అధికారులు కసరత్తు చేస్తున్నారు. ఈ పరిస్థితుల్లో గ్యాస్ సమస్య వినియోగదారులను గందరగోళ పరుస్తుంది. గ్యాస్ కనెక్షన్లు గల వినియోగదారులను గుర్తించడంలో వారి పత్రాల పరిశీలనకు ఏజన్సీలు రేషన్‌కార్డు జెరాక్స్ కాపీ అడుగుతుండడంతో రేషన్‌కార్డు కోల్పోయిన వినియోగదారులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. దీనిపై పౌరసరఫరాలశాఖ నిర్దిష్టమైన ఆదేశాలు జారీ చేయాలని ప్రజలు కోరుకొంటున్నారు.

● వెంకటాచలంలో

# క్షీణించిన పారిశుధ్యం!

## జ్వరాల బారిన పల్లెలు

వెంకటాచలం మండలంలో పారిశుధ్యం క్షీణించింది. చెత్తచెదారాలు, పందుల స్వైర విహారం, దోమల విజృంభణతో మండలంలో పరిస్థితి అధ్వాన్నంగా తయారైంది. ఎక్కడికక్కడ గ్రామాల్లో మురుగునీరు ప్రవహిస్తూ, చెత్త కుప్పలతో దర్శనమిస్తున్నాయి. అసలే జిల్లాలో డెంగ్యూ తదితర విషజ్వరాల బారిన పడుతున్నా గ్రామాల్లో పారిశుధ్య పరిస్థితులు మెరుగుపరచేందుకు ఎవరు తగిన చర్యలు చేపట్టకపోవడంతో రోజురోజుకు పారిశుధ్య పరిస్థితులు దిగజారిపోతున్నాయి. అనికేపల్లి, గొలగమూడి తదితర గ్రామాల్లో పందుల సంచారం అధికంగా వుంది. పంచాయితీలలో ప్రత్యేకాధికారుల పాలన కొనసాగుతుండడంతో ప్రజలు బాగోగులు పట్టించుకొనే వారే లేకుండా పోయారు.

# నీలంకు వణికిన మత్స్యకారులు

## వలలు తెప్పలను అలలు పట్టుకెళ్లాయి.



బంగళాఖాతంలో ఏర్పడిన నీలం తుఫాను జిల్లాలోని మత్స్యకారులకు తీరని నష్టాన్ని మిగిల్చింది. ఎడతెరపి లేని వర్షం, ఈదురు గాలులతో మత్స్యకార ప్రాంతాల్లోని వారు ఆందోళన చెందారు. సముద్రంలో క్షణక్షణానికి అలల ఉధృతి అధికం కావడం, షుమారు 50 మీటర్ల మేర సముద్రం ముందుకు చొచ్చుకొని రావడంతో సమీప ప్రాంతాల్లోని మత్స్యకార కుటుంబాలు వణికిపోయాయి. ఎప్పుడు ఏం జరుగుతుందోనని వారు హడలిపోయారు. బోట్లు, వలలను ఎత్తయిన ప్రదేశానికి తరలించడానికి మత్స్యకారులు ప్రయత్నించినా పలు ప్రాంతాల్లో తీవ్ర నష్టం సంభవించింది. ముత్తుకూరు మండలంలోని కృష్ణపట్నం, ఆర్కాట్‌పాళెం, రామ్‌నగర్, నేలటూరుపాళెంలో మత్స్యకారుల వలలు, తెప్పలు అలల తాకిడికి కొట్టుకొనిపోయాయి. అక్టోబర్ 31 సాయంత్రానికి తుఫాను తీరం దాటినా ఆ ప్రభావం వలన జిల్లాలో భారీ వర్షాలు కురిశాయి. ఈదురుగాలులకు చాలా చోట్ల చెట్లు నేలకూలడంతో రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడింది. దీనికి తోడు విద్యుత్ స్తంభాలు నేలకొరగడంతో పలు ప్రాంతాల్లో విద్యుత్ సరఫరా నిలచిపోయి అంధకారం అలుముకొంది. తుఫాను కారణంగా వేటలేకపోవడంతో రెక్కడితేగాని డొక్కాడని మత్స్యకారులకు వలలు, బోట్లు కొట్టుకొనిపోవడంతో ఆర్థికంగా నష్టం వాటిల్లింది.

● బెల్ట్ షాపులపై

# మహిళల సమరభేరి!

## అల్లూరులో రాజుకున్న ఉద్యమం

కుటుంబాలను చిన్నాభిన్నం చేస్తున్న మద్యం బెల్టుషాపులను తొలగించాలని అల్లూరు మండలానికి చెందిన మహిళలు ధర్నా చేపట్టారు. కుటుంబాల్లో చిచ్చుపెడుతున్న బెల్టుషాపుల భరతం పట్టాలని డిమాండ్ చేస్తూ మండలానికి చెందిన నార్త్ ఆములూరు గ్రామానికి చెందిన మహిళలు అల్లూరు తహశీల్దార్ కార్యాలయం వద్ద ఆందోళనకు దిగారు. అధికారుల తీరుపై మండిపడ్డారు. కూలీనాలీ చేసుకొని కుటుంబాలను పోషించుకుంటున్నామని, విచ్చలవిడిగా వెలుస్తున్న మద్యం షాపులు, బెల్టుషాపుల కారణంగా తమ భర్తలు డబ్బులను మద్యానికి ఖర్చు చేస్తూ కుటుంబాలను నిర్లక్ష్యం చేస్తున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. పలుమార్లు దీనిపై పోలీసులకు, రెవెన్యూ, ఎక్సైజ్ తదితరశాఖల అధికారులకు తెలిపినా పట్టించుకోలేదన్నారు. ఆర్థికంగా దెబ్బతినడంతోపాటు మద్యం కారణంగా గ్రామాల్లో గొడవలు, దొంగతనాలు అధికం అవుతున్నాయని, శాంతి భద్రతలకు విఘాతం కల్గుతున్నాదని తెలిపారు. దీని వలన తమ పిల్లల భవిష్యత్తు దెబ్బతినే ప్రమాదముందని ఆందోళన వ్యక్తం చేశారు. నార్తు ఆములూరులో ఒకటికి నాలుగు బెల్టుషాపులు వున్నాయన్నారు. ఆ షాపులు నిర్వహించే వారి పేర్లు, వివరాలను తహశీల్దార్ శ్రీనివాసులరెడ్డికి ఇచ్చి ఫిర్యాదు చేశారు. తక్షణం నార్తు ఆములూరుతోపాటు మండలంలోని బెల్టుషాపులను తొలగించాలని డిమాండ్ చేశారు.

# వాళ్లు మాయల మరాఠీలు!

## సిఎం, చంద్రబాబులను విమర్శించిన ప్రసన్న.



ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, ప్రతిపక్ష నేత నారా చంద్రబాబునాయుడు పగలు శత్రువులుగా, రాత్రి మిత్రులుగా వ్యవహరిస్తున్నారని కోవూరు శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి ఆరోపించారు. వీరిద్దరి వ్యవహారం చూసిన ఎవరికైనా ఈ సంగతి అర్థమవుతుందన్నారు. బుచ్చిరెడ్డిపాళెం మండలంలో పర్యటించిన ఆయన కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలపై విమర్శలు చేశారు. రాష్ట్రంలో ప్రజలు పెరిగిన ధరలతో సతమతమవుతుంటే కాంగ్రెస్ ప్రభుత్వం పట్టించుకోవడం లేదని విమర్శించారు. ప్రభుత్వ వ్యతిరేక విధానాలను ఎండగట్టాల్సిన తెలుగుదేశం పార్టీ ఆ పని చేయక అధికార కాంగ్రెస్ పార్టీతో కుమ్మక్కైందన్నారు. చంద్రబాబునాయుడు, కిరణ్‌కుమార్ రెడ్డి ప్రజల్లో జగన్మోహన్‌రెడ్డి పట్ల, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ పట్ల వున్న ప్రజాదరణ చూసి తట్టుకోలేక ఢిల్లీ వెళ్లి అక్కడి పెద్దలతో రహస్య మంతనాలు చేసి జగన్‌ను జైలు నుంచి విడుదల కాకుండా చేస్తున్నారని ఆరోపించారు. చంద్రబాబుకు ధైర్యం వుంటే కాంగ్రెస్ ప్రభుత్వంపై అవిశ్వాసం పెట్టాలని, దానికి వైఎస్ఆర్ పార్టీ ఎమ్మెల్యేలు మద్దతిస్తారని తెలిపారు. తెలుగుదేశం పార్టీని, ఆ పార్టీ అధినేత చంద్రబాబు నాయుడును ప్రజలు నమ్మేస్థితిలో లేరన్నారు. ఎన్ని పాదయాత్రలు చేసినా తెలుగుదేశం పార్టీ అధికారంలోకి రావడం జరగని పని అని తేల్చి చెప్పారు. ప్రజాసమస్యలపై పాదయాత్ర చేస్తున్న మహిళగా షర్మిళ పేరు చిరస్థాయిగా నిలచిపోతుందన్నారు. అనంతరం మండలంలోని వివిధ ప్రాంతాల ప్రజలు ఇచ్చిన వినతి పత్రాలను స్వీకరించారు. ఈ కార్యక్రమంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకులు మల్లిఖార్జున్‌రెడ్డి, సుధాకర్‌రెడ్డి, శంకర్‌రెడ్డి, మోహన్ తదితరులు పాల్గొన్నారు.

# ఇందుకూరుపేటలో కల్తీ కల్లు!

## గంగపట్నంలో వ్యక్తి మరణం

ఇందుకూరుపేట మండలంలో కల్తీ కల్లు విక్రయాలు జోరుగా సాగుతున్నాయి. మండలంలో కల్లు విక్రయించేవారు కొందరు అందులో మత్తు మాత్రలు కలిపి అమ్ముతుండడంతో అవి తాగినవారు ప్రాణాల మీదకు తెచ్చుకొంటున్నారు. గంగపట్నం, జగదేవిపేట తదితర ప్రాంతాలలో కల్తీ కల్లు విక్రయాలు అధికంగా వున్నాయి. అమాయకులైన గిరిజనుల బలహీనతను సొమ్ము చేసుకొనేందుకు వ్యాపారాలు ఇలాంటి చర్యలకు పాల్పడుతుండడంతో మండలంలో పలువురు మృత్యువాత పడ్డారు. జగదేవిపేట గ్రామంలో కల్తీ కల్లు తాగి సుబ్బమ్మ అనే మహిళ మృతి చెందింది. గంగపట్నంలోనూ కల్తీకల్లుతో ప్రాణాలు కోల్పోయిన ఘటనలు జరిగాయి. ఇంత జరుగుతున్నా ఎక్సైజ్ అధికారులు పట్టించుకోకపోవడంతో వీటి అమ్మకాలు అధికంగా జరుగుతున్నాయి. ఇప్పటికైనా ప్రజల ప్రాణాలను దృష్టిలో వుంచుకొని కల్తీకల్లు విక్రయాలను అరికట్టాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.

# కావలిలో చిరంజీవి అభిమానుల సంబరాలు

## చింతాల, శ్రీదేవిల దడబడలు

రాజ్యసభ సభ్యుడు చిరంజీవికి కేంద్రమంత్రివర్గంలో స్థానం లభించడం పట్ల కావలి నియోజకవర్గంలో ఆయన అభిమానులు హర్షం వ్యక్తం చేశారు. కావలి పట్టణంతోపాటు బోగోలు, దగదర్తి తదితర ప్రాంతాలలో అభిమానులు బాణాసంచా పేల్చి, మిఠాయిలు పంచి పెట్టారు. పట్టణ పరిధిలో చిరంజీవి అభిమాన సంఘనేత చింతాల వెంకట్రావు, చిరంజీవి ప్రజాసేనా సమితి అధ్యక్షురాలు పద్మావతి శ్రీదేవి ఆధ్వర్యంలో సంబరాలు జరుపుకొన్నారు. చిరంజీవికి పర్యాటకశాఖ అప్పగించడం ద్వారా ఆయన అవసరాన్ని పార్టీ గుర్తించిందన్నారు. ఈ సందర్భంగా వీరు గాంధీవిగ్రహానికి పూలమాల వేశారు.

# వెంకటగిరి గ్రామీణ రోడ్లు తీన్నారు!

## రాకపోకలకు తీవ్ర ఇబ్బందులు



వెంకటగిరి నియోజకవర్గంలో గ్రామీణ రహదారులు ధ్వంసమైపోయాయి. నియోజకవర్గంలోని వివిధ ప్రాంతాలను కలుపుతూ తారురోడ్లు, గ్రావెల్ రోడ్లు నిర్మించినప్పటికి నిర్మాణ పనుల్లో నాణ్యత కొరవవడంతో వేసిన కొద్ది కాలానికే రూపురేఖలు కోల్పోయాయి. గ్రావెల్ రోడ్ల స్థానంలో తారు రోడ్లు వస్తాయని ఎదురు చూస్తున్న ప్రజలకు వున్న రోడ్లే గుంటలు మిట్టలు పడి రాకపోకలకు ఇబ్బందిగా మారడంతో పలు ప్రాంతాల ప్రజలు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. దెబ్బతిన్న రోడ్లకు మరమ్మత్తులు జరుపుతారని, కొత్తరోడ్లు వేస్తారని ఎదురు చూస్తున్న వారికి నిరాశే మిగులుతోంది. వెంకటగిరి మండలంలోని గొట్లగుంట, పాళెం కోట, అక్బర్ నివాస కండ్రిగ తదితర ప్రాంతాలలో రోడ్లు దారుణంగా దెబ్బతిన్నాయి. బాలాయపల్లి మండలంలోని జయింపు – గొల్లపల్లి, పిగిలాం రోడ్లు ఛిద్రమైపోయి వున్నాయి. డక్కిలి మండలం దగ్గవోలు, వెంబులూరు, దేవుడు వెలంపల్లి రోడ్ల పరిస్థితి అధ్వాన్నంగా వుంది. గ్రామీణ రోడ్లు పూర్తిగా ధ్వంసమైపోవడంతో రాకపోకలకు తీవ్ర ఇబ్బందులు ఎదురౌతున్నాయని ప్రజలు వాపోతున్నారు. వర్షం వచ్చిందంటే పరిస్థితి మరింత దిగజారిపోతోంది. రోడ్లపై పడిన గుంటల్లో వర్షపు నీరు చేరుతుండడంతో వాహనాలు నడిపేవారు ప్రమాదాలకు గురౌతున్నారు. ప్రజల అవస్థలను దృష్టిలో వుంచుకొని గ్రామీణ రహదారులను బాగు చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# ● బోగోలు బిజెపిలో అసమ్మతి సెగలు!

## ఆయారాం, గయారాంలకు పదవులిచ్చిన కందుకూరి



బిజెపి జిల్లా నాయకత్వాన్ని ఎండగడుతున్న జయరాజ్.

క్రమశిక్షణకు మారుపేరుగా చెప్పుకొనే బిజెపిలో ఇటీవల జరిగిన కార్యవర్గ కూర్పు అసంతృప్తి సెగ రాజేసింది. సీనియర్లు, పార్టీ కోసం పనిచేసే వారిని ప్రక్కన పెట్టి వర్గ రాజకీయాలను ప్రోత్సహిస్తున్నారని, కార్యకర్తల అభిప్రాయాలు పరిగణలోనికి తీసుకోకుండా నాలుగు గోడల మధ్య నిర్ణయాలు తీసుకొంటున్నారంటూ బోగోలు దళిత మోర్చా నేతలు ఆందోళన చేపట్టారు. కావలి బిజెపి నేత కందుకూరి సత్యనారాయణ, శ్రీనివాసరెడ్డి, సత్యంలు కుమ్మక్కై దళితులకు పార్టీలో సముచిత స్థానం ఇవ్వకుండా అన్యాయం చేశారని దళితమోర్చా ఆరోపించింది. దళిత మోర్చా జిల్లా ప్రధాన కార్యదర్శి జయరాజ్ తదితరులు పార్టీ నేతల తీరుపై విమర్శలు చేశారు. బోగోలు మండలంలో గ్రామకమిటీ, మండల కమిటీ నియామకాల్లో ఏకపక్షంగా వ్యవహరించారన్నారు. పార్టీకి మొదటి నుంచి వెన్నదన్నుగా వున్న వారిని ప్రక్కనపెట్టి పార్టీలు మార్చే వారికి బాధ్యతలు అప్పగించడంపై మండిపడ్డారు. కమిటీలను రద్దు చేయకుంటే జిల్లా పార్టీ కార్యాలయం ముందు ఆందోళన చేపడుతామని హెచ్చరించారు. ఈ సమావేశంలో మండల బిజెపి నాయకులు యతిరాజుల నాయుడు, జనార్ధన్, వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

# కబ్జాదారుల కోరల్లో వింజమూరు!

## ● ప్రభుత్వ, ప్రైవేట్ స్థలాలన్న తేడా లేదు

వింజమూరులో కబ్జాదారులు పేట్రేగిపోతున్నారు. ప్రభుత్వ, ప్రైవేట్ స్థలం అన్న తేడా లేకుండా ఖాళీ స్థలం కన్పడితే ఆక్రమించేస్తుండడంతో ఈ ప్రాంతంలో ఆక్రమణలు రోజురోజుకు అధికం అవుతున్నాయి. భూముల ధరలు పెరిగిపోవడంతో రియల్ ఎస్టేట్ వ్యాపారులు, ఇతరుల కన్ను ఖాళీ స్థలాలపై పడుతోంది. సంబంధితశాఖల సిబ్బందిని లోబరుచుకొని ప్రభుత్వ స్థలాలు కబ్జా చేసేస్తుండడంతో ఆక్రమణలు జోరందుకొన్నాయి. పంచాయితీ స్థలాలు ఆక్రమించేస్తున్నా అడిగే వారే లేకుండా పోయారు. ఆక్రమణదారులు దేనికి వెరవక ప్రభుత్వ స్థలాలను ఆక్రమించుకొని తమ పరం చేసుకొంటున్నా పట్టించుకోకపోవడంతో ప్రభుత్వ స్థలాలు కన్పించకుండా పోయే పరిస్థితి ఏర్పడిందని స్థానికులు వాపోతున్నారు. స్థలాలను దురాక్రమించడమేకాక ఏకంగా ఆ స్థలాల్లో నిర్మాణాలు జరిపి భవంతులు నిర్మించి బాడుగలకు ఇస్తున్నా ఆవైపు కన్నెత్తి చూసే అధికారే లేకుండా పోవడంతో వింజమూరులో ఆక్రమణలు యదేచ్ఛగా జరిగిపోతున్నాయి. స్థానిక ఆర్‌టిసి బస్టాండ్ సమీపంలో మెయిన్‌రోడ్డును ఆనుకొని వున్న నీటి పారుదలశాఖకు 43అంకణాల స్థలం వుంది. ఈ స్థలాన్ని ఆక్రమించేసిన కబ్జాదారులు ప్రక్కనే గల కాలువను సైతం వదలలేదు. ఇక్కడ అంకణం విలువ మూడు నుంచి నాలుగు లక్షలు పలుకుతుండడంతో విలువైన స్థలాలపై కన్నేసి ఒక పథకం ప్రకారం వాటిని ఆక్రమించేస్తున్నారు కొందరు. వీరికి రాజకీయ అండదండలు, లంచాలకు కక్కుర్తిపడిన అధికారులు తమ సహాయ సహకారాలు అందిస్తుండడంతో ఆక్రమణలు పెరిగిపోతున్నాయి.

# రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి పాదయాత్ర!

## కావలి నియోజకవర్గ రైతు సమస్యలే అజెండా



కావలి కాలువ ఆయకట్టు రైతుల సమస్యలపై వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ పాదయాత్రకు సిద్ధమవుతోంది. రైతుల పక్షాన పోరాడేందుకు నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్ రెడ్డి ఆధ్వర్యంలో పాదయాత్ర చేపట్టేందుకు సమాయత్తం అవుతున్నారు. కావలి కాలువ నుంచి సాగు నీరు అందే దగదర్తి, బోగోలు, కావలి మండలాలకు సంబంధించిన ఆ పార్టీ నేతలతో ఈ విషయమై చర్చిస్తున్నారు ప్రతాప్‌కుమార్‌రెడ్డి. దీనిపై ఆయన మాట్లాడుతూ తమపార్టీ ఆధ్వర్యంలో ఆయకట్టు రైతాంగ సమస్యలపై పాదయాత్ర చేపడుతున్నామన్నారు. ఏఏ ప్రాంతాల్లో, ఎన్ని కిలోమీటర్లు పాదయాత్ర చేయాలన్న అంశంపై ఇతర నేతలతోనూ మాట్లాడి నిర్ణయం తీసుకొంటామన్నారు. ప్రజాప్రతినిధులు ప్రజల సమస్యలు పట్టించుకోవడంలేదని విమర్శించారు. కావలి నియోజకవర్గ ప్రజలు పారిశుధ్యం, త్రాగునీటి సమస్య ఎదుర్కొంటున్నారన్నారు. పట్టణంలో పారిశుధ్యం అధ్వాన్నంగా మారిందని, చివరకు వీధిలైట్లు వెలగని దుస్థితిలో పురపాలన వుందన్నారు. అటు అధికారులు, ఇటు ప్రజాప్రతినిధులు పట్టించుకోకపోవడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారని తెలిపారు. ఈ సమావేశంలో వైఎస్ఆర్ పార్టీ నేతలు చింతం బాబురెడ్డి, తూపిలి పెంచలయ్య, పర్రి అంకులయ్య, తిరివీధి ప్రసాద్, పాలడుగు వెంకట్రావు, వెంగళరెడ్డి తదితరులు పాల్గొన్నారు.



# అసురులపై దైవత్వ విజయానికి సూచిక దీపావళి!

దీపావళి అనగా దీపాల వరుస అని అర్థం. చీకట్లను పారద్రోలి వెలుగులు నింపే పండుగైన దీపావళికి ఒక ప్రత్యేకత వుంది. కులమత బేధాలు ప్రమేయం లేకుండా దేశవ్యాప్తంగా అందరూ ఆనందోత్సాహాలతో జరుపుకొనే పండుగ ఇది. చెడు మీద మంచి సాధించిన విజయానికి చిహ్నంగా దీపావళి పండుగను జరుపుకోవడం ఆనవాయితి. అజ్ఞానమనే చీకట్లను తొలగించి జ్ఞానమనే జ్యోతులకు సంకేతంగా దీపావళి పర్వదినాన్ని చెపుతారు. ఆశ్వీయుజ బహుళ అమావాస్య నాడు దీపావళిని చేసుకొంటే, దానికి ముందు వచ్చే చతుర్దశిని నరక చతుర్దశిగా జరుపుకొంటారు. ఆ తర్వాత రోజైన కార్తీకశుద్ధ పాడ్యమిని బలిపాడ్యమి అంటారు. కొన్ని ప్రాంతాలలో దీపావళి పండుగ సంబరాలను మూడురోజులపాటు, ఉత్తరభారత దేశంలో ఐదు రోజులపాటు ఆనందోత్సాహాల నడుమ చేసుకొంటారు.

అపమృత్యు నివారణ కోసం నూనె దీపాలను వెలిగించి ఇంటిముందు వుంచుతారు. సత్యభామ సమేతుడైన శ్రీకృష్ణుడు నరకాసురుడిపై యుద్ధానికి వెళ్లి ఆ అసురుడిని వధించిన రోజున నరక చతుర్దశిగా భావిస్తారు. దీనినే అసురులపై దైవత్వ విజయంగా చెప్తారు. నరకాసురుడిని సత్యభామ ఒక్క బాణాన్ని ప్రయోగించి అంతం చేసినందుకు గుర్తుగా ఆనాడు బాణాసంచా పేల్చి పండుగ జరుపుకొంటారు. దీనినే కొన్ని ప్రాంతాలలో చిన్న దీపావళి అని, మరుసటిరోజు అమావాస్య నాడు జరుపుకొనే దీపావళిని పెద్ద దీపావళి అని అంటారు. దీపానికి వెలుగు అనే అర్థం వుంది. కామ, క్రోధ, మద, మోహ, అహంకారాలను నరకాసురుడికి చిహ్నంగా వాటిని తొలగించి వెలుగులు నింపడాన్ని, అంటే చీకట్లను తొలగించి జ్ఞాన జ్యోతులను వెలిగించడాన్ని అసురులపై దైవత్వ విజయానికి సూచికగా చెప్తారు. అసుర శక్తి పై ఈశ్వరీయ శక్తికి విజయానికి చిహ్నంగా దీపావళి పండుగను చెబుతారు. దీపావళి రోజును లక్ష్మీదేవిని ఆరాధిస్తారు. సాయంకాలం ప్రదోష సమయంలో తులసి చెట్టును లక్ష్మీదేవి రూపుగా భావించి తులసి కోట ముందు దీపం వెలిగిస్తారు. పిండి వంటలను నైవేద్యంగా సమర్పిస్తారు. లక్ష్మీదేవిని పూజించడం వలన భోగభాగ్యాలు కల్గుతాయని పురాణాలు చెప్తున్నాయి. ఎవరు ఆమెను నిండుమనస్సుతో ఆరాధిస్తారో వారి కోరికలు తీరుస్తుందని, అందుకోసం వివిధ అవతారాలలో కన్పిస్తుందని చెప్తారు. నిస్సంతులు పూజిస్తే వారికి సంతాన లక్ష్మిగా, విజయం కోసం ప్రార్థిస్తే విజయ లక్ష్మిగా, చదువు కోసం అర్చిస్తే విద్యా లక్ష్మిగా, ధనం కోసం పూజిస్తే ధనలక్ష్మిగా, ధైర్యలక్షిగా, ధాన్యలక్ష్మిగా వివిధ రూపాలలో లక్ష్మీదేవి కటాక్షిస్తుందని చెప్తారు. ఏ ఇంట దీపాల వెలుగులు కన్పిస్తాయో అక్కడ లక్ష్మీదేవి కొలువై వుంటుందని పురాణాలు వివరిస్తున్నాయి. అందుకే దీపావళి నాడు ఇంటిని దీపాలతో అలంకరిస్తారు. దీపావళి మరుసటి రోజైన కార్తీక శుద్ధపాడ్యమిని బలి పాడ్యమిగా జరుపుకొంటారు. వామనావతారంలో శ్రీ మహావిష్ణువు బలిచక్రవర్తిని మూడడుగుల నేల దానంగా అడిగి ఒక అడుగు ఆకాశాన్ని, రెండో అడుగు భూమిపై వుంచి మూడో అడుగును బలి శిరస్సుపై పెట్టి అతన్ని పాతాళానికి అణచివేస్తాడు. ఆ సమయంలో బలి కోరికపై ఏడాదిలో ఒక రోజు భూమి మీదకు వచ్చి పరిపాలించే వరం ఇస్తాడు. ఆ రోజునే బలి పాడ్యమిగా పిలుస్తారు. బాహ్యమైన చీకటిని పారద్రోలడంతోపాటు మానసిక జాడ్యాలను, చెడు భావనలను తొలగించేదిగా, భిన్నత్వంలో ఏకత్వాన్ని చాటి చెప్పే పండుగగా దీపావళిని చెప్పొచ్చు. J



సభలు - సమావేశాలు

# భక్తితో ఆరాధిస్తే భగవంతుడు పలుకుతాడు!

## • నెల్లూరులో భక్తులకు సందేశమిచ్చిన శ్రీభారతి తీర్థానందస్వామి

జగద్గురువు ఆదిశంకరాచార్యులు అద్వైతాన్ని ప్రబోధిస్తూ దేశమంతా పర్యటించారు. ఆ సందర్భంలో ఆయన మొట్టమొదట స్థాపించిన మఠం శృంగేరి శారదా పీఠం. కర్నాటక రాష్ట్రంలో తుంగభద్రా నది ఒడ్డున వున్న ఈ పీఠానికి దక్షిణామ్నాయ అనే పేరుంది. శంకర భగవత్‌పాదులు ఏర్పాటుచేసిన ఈ మఠానికి 36వ పీఠాధిపతి శ్రీ భారతి తీర్థానందస్వామి. భక్తులకు ఆశీస్సులు అందజేసేందుకు నవంబర్ 6న నగరానికి విచ్చేసిన స్వామి వివిధ కార్యక్రమాలలో పాల్గొన్నారు. మొదటగా మూలాపేటలో గల మూలస్థానేశ్వర ఆలయానికి విచ్చేసిన ఆయనకు పూర్ణకుంభంతో స్వాగతం పలికారు. అక్కడ ప్రత్యేక పూజలు నిర్వహించారు. సాయంత్రం రామలింగాపురం వద్దగల ప్రసన్న వెంకటేశ్వరస్వామి ఆలయం వద్ద నుంచి మినీబైపాస్ రోడ్డులోని జిపిఆర్ గ్రాండ్ వరకు నగరోత్సవం నిర్వహించారు. అక్కడ భక్తులకు శ్రీ భారతి తీర్థానందస్వామి దర్శనమిచ్చి, అనుగ్రహభాషణ చేశారు.

భక్తి పూర్వకంగా భగవంతుడిని ఆరాధిస్తే ఆయన తప్పక పలుకుతాడని శృంగేరి పీఠాధిపతి భారతి తీర్థానందస్వామి ఉద్బోధించారు. ప్రతిఒక్కరూ దైవచింత కల్గి వుండాలన్నారు. భగవత్ కృప అనేది నది లాంటిదని, ఎవరు ఎంతమేరకు పాత్రనుపయోగించి నీటిని తోడుకోగలుగుతారో అలాగే దైవ కృప లభిస్తుందన్నారు. తమ శక్తిమేర ఆరాధిస్తే వారికి భగవంతుడు అంతటి కృపే చూపుతాడన్నారు. ప్రతిఒక్కరు సత్యం, ధర్మ, న్యాయ సూత్రాలను పాటించాలన్నారు. ధర్మంపై అధర్మం పైచేయి సాధించినా అది తాత్కాలికమేనన్నారు. ఏనాటికైనా ధర్మమే జయిస్తుందన్నారు. నేడు అందరు జాతీయ సమైక్యతను గురించి చెపుతున్నా ఆచరణలో అది ఎవ్వరిలోనూ కన్పించడం లేదని, ఆదిశంకరాచార్యులు దానిని కొన్ని దశాబ్దాల క్రితమే ఆచరించి చూపారన్నారు. అద్వైతాన్ని ప్రచారం చేస్తున్న శంకరాచార్యులు శృంగేరిలో మొట్టమొదటిగా శారదాపీఠాన్ని స్థాపించారన్నారు. దీంతోపాటు కంచి, పూరి తదితర ప్రాంతాలలో మఠాలను ఏర్పాటుచేసి వాటికి పీఠాధిపతులుగా వివిధ ప్రాంతాలవారిని నియమించి జాతీయ సమైక్యతను చాటి చెప్పారన్నారు. ఆదిశంకరులు సాక్షాత్తు మహాశివుని అవతారం అన్నారు. 32 ఏళ్ల వయసుకే అనితర సాధ్యమైన ప్రతిభాపాఠవాలను ప్రదర్శించారన్నారు. శంకర భగవత్‌పాదులు చూపించిన మార్గంలో నడిస్తే శంకరుని అనుగ్రహం లభిస్తుందన్నారు. వేదాలే భారతీయతకు ఆధారమని, అలాంటి వేదాలను అధ్యాయనం చేసి అద్వైతాన్ని శంకరాచార్యులు అందించారని అభిభాషణ చేశారు. చాలాకాలం తర్వాత నగరానికి విచ్చేసిన శృంగేరి శారదా పీఠాధిపతి శంకరాచార్య శ్రీభారతి తీర్థానంద స్వామిని దర్శించేందుకు, ఆయన ఉపన్యాసం వినేందుకు అధిక సంఖ్యలో భక్తులు తరలి వచ్చారు. J



నెల్లూరు జిపిఆర్ గ్రాండ్ కళ్యాణ మండపంలో భక్తులను ఆశీర్వదిస్తున్న శృంగేరి పీఠాధిపతి శ్రీ భారతి తీర్థానందస్వామి.

● పోలీసుపై వివేకా విమర్శలు

# హోమ్‌గార్డు పోస్టులు ఇవ్వనందుకా?

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి బుర్రను ఎప్పుడు ఏ పురుగు తొలుస్తుందో ఊహించడం చాలా కష్టం. బాగా ఉన్నట్లే కనపడతాడు, ఉన్నట్లుండి పూనకం వచ్చిన వాడి వలె ప్రవర్తిస్తాడు. ఆయన్ను చూస్తే ఒక్కొక్కసారి జాలి కలుగుతుంది. తాజాగా పోలీస్ శాఖ మీద విరుచుక పడ్డాడు. నెల్లూరు టౌన్‌లో ట్రాఫిక్ నియంత్రణ పూర్తిగా లోపించి పోయిందని, పోలీసులు చలానాలు వ్రాసి జనాన్ని వేధించుక తింటున్నారని, ఆ శాఖలో అవినీతి పెరిగిపోయిందని... నోటికి వచ్చినట్లల్లా మాట్లాడేశాడు. ఆ విమర్శలకు పరోక్ష లక్ష్యం ఎస్పీ రమణకుమార్ గారన్నది స్పష్టం. కానీ ఎక్కడా ఆ పేరు చెప్పలేదు.

నెల్లూరు టౌన్‌లో ట్రాఫిక్ నియంత్రణ అదుపు తప్పిన మాట నిజమే. కానీ దానికి కారణం ఎవరు? ఆ ప్రశ్నకు నేరుగా వచ్చే సమాధానం వివేకానంద రెడ్డి పేరే. నెల్లూరు టౌన్‌ను సర్వనాశనం చేసిన పుణ్యాత్ముడు ఆయనే కదా మరి. నెల్లూరు టౌన్‌కు ఉండేది ఒక్కటంటే ఒక్కటే రోడ్డు. పదిహేడేళ్లుగా పదవిలో ఉన్న ఆ పెద్ద మనిషికి ఆ ఒక్క రోడ్డును శుద్ధంగా బాగు చేయించడం చేతకాలేదు. వెంకటేశ్వరపురం నుంచి వేదాయపాళెం వరకు రోడ్డును వెడల్పు చేసి, మార్జిన్లు స్పష్టంగా నిర్ణయించి, ఆక్రమణలు తొలగిస్తే నెల్లూరు టౌన్‌లో ట్రాఫిక్ సమస్య అనేదే ఉండదు. కానీ వివేకానందరెడ్డి తన అతి తెలివంతా ప్రదర్శించి అసలే ఇరుకైన ఆ రోడ్డు మీద సమాధుల వంటి డివైడర్లు నిర్మించాడు. అవి రోడ్డు మొత్తాన్ని తినేశాయి. వైఎస్, ఇందిరమ్మ, నెహ్రూ, మాగుంట వంటి విగ్రహాల దగ్గర విశాలమైన ట్రాఫిక్ ఐలాండ్లు కట్టించాడు. అవి రోడ్డును మూసేశాయి. ఆ ఐల్యాండ్ల దగ్గర ఆటో తిప్పుకోవాలంటేనే తల ప్రాణం తోకకు వస్తుంది. ఇక బస్సులు, లారీల వాళ్ల గోడు చెప్పనే అవసరం లేదు. ట్రాఫిక్ సమీక్ష సమావేశం ఎప్పుడు పెట్టినా నిపుణులైన అధికారులంతా ఈ డివైడర్లు, ట్రాఫిక్ ఐల్యాండ్లను తొలగిస్తే తప్ప పరిస్థితి మారదని మొత్తుకొంటున్నారు. కానీ ఎమ్మెల్యే గారికి తాను కట్టించిన సమాధులను తొలగించడం ఎంతమాత్రం ఇష్టం లేదు. దానితో పోలీస్ ట్రాఫిక్ సమస్యను ఏమీ చేయలేక పోతున్నది. ఈ నిజాన్ని కప్పి పుచ్చి, ట్రాఫిక్ విషయంలో పోలీసును నిందించడంలో ఆయన దురుద్దేశం వేరే ఉందని వినికిడి.

నెల్లూరు ఎస్పీ రమణకుమార్ సాత్వికుడు. మృదుస్వభావి. కానీ నీతి నిజాయితీల విషయంలో చాలా గట్టిగా నిలబడతాడని పేరు. ఎవరితో వివాదం కొని తెచ్చుకోడు; కానీ ఎవరి ఒత్తిడికి లొంగి తప్పుడు పనులు చేయడు. ఆ తత్వం రాజకీయవాదులకు సహజంగానే సహ్యం కాదు. ఇటీవల జరిగిన హోమ్ గార్డు పోస్టుల విషయంలో సిఫార్సు చీటీలను పక్కన పెట్టి, నియామకాలు జరిపాడట ఎస్పీ గారు. వివేకానందరెడ్డి మనసుకు నచ్చిన మహిళామణి ఆ ఉద్యోగాలిప్పిస్తానని చాలా మంది వద్ద లక్ష నుంచి లక్షన్నర వరకు దండుకొన్నాదట. ఆమె అడిగిన వారికి ఉద్యోగాలు రాకపోవడంతో వివేకాకు పిచ్చెత్తిపోయింది. అసలు నిజం బయటకు చెప్పుకోలేక ఈ రకంగా పోలీస్ శాఖ మీద నిందలు వేయడం మొదలు పెట్టాడు. అయితే పోలీస్ అధికారుల సంఘం నాయకుడు శ్రీహరి సాహసించి పోలీస్‌ను వూరకే నిందిస్తే వూరుకోమని హెచ్చరిస్తూ ప్రకటన చేయడంతో పిల్లి వలె తోక ముడిచేశాడు వివేకా. తిట్టిన పోలీస్‌నే పొగుడుతూ మళ్లీ ప్రకటన చేయక తప్పలేదు.

ఎస్పీ గారిని నెల్లూరు నుంచి బదలీ చేయించాలనే ప్రయత్నంలో పడ్డాడు వివేకానందరెడ్డి ఇప్పుడు. సహజంగానే ఆయన తమ్ముడుగారు అందుకు తందాన అంటున్నాడు. అయితే ఎస్పీ పనితీరు మీద డిజిపి దినేష్‌రెడ్డి గారికి స్పష్టమైన అవగాహన ఉంది. ఎమ్మెల్యేలు చేసే తప్పుడు ఆరోపణలు, వక్రపు ఒత్తిడులకు లొంగి నిజాయితీపరుడైన అధికారిని బలి చేసేందుకు ఆయన ఒప్పుకోడనే ఆశిస్తున్నాము.

## నిట్టనిలువునా చీల్చిన ఎన్నికలివి !

16వ పేజీ కొరవ

చరిత్రలో ఈ పరిస్థితి ఎప్పుడూ లేదు. మతము, జాతి, కులము వంటి తేడాలలో అమెరికన్లు ఎన్నికలలో పాల్గొనడాన్ని ఎవరూ నమ్మలేక పోతున్నారు. కానీ అది నిజం.

### చీలిక గుర్తించిన ఒబామా

ప్రమాదకరమైన ఈ పరిణామాన్ని గమనించి నందువల్లనే ఒబామా తన విజయోత్సవ ప్రసంగంలో అమెరికన్లందరమూ ఏకతాటి మీద నడుద్దామని పిలుపు ఇచ్చాడు. పేదా గొప్ప, తెల్ల నల్ల, భారత్ – చైనా, క్యాథలిక్ ప్రొటెస్టెంట్, యువకులు ముసలి వారు అనే తేడాలు లేకుండా కలిసి పని చేద్దామని విజ్ఞప్తి చేశాడు.

### ముందున్నది ముసళ్ల పండగ

ఒబామాకు గెలుపు ఎంత కష్టంగా లభించిందో పాలన కూడా అంతే కష్టంగా నడవనున్నది. ఆయన ముందు చాలా సవాళ్లే వున్నాయి. అన్నిటి కంటే కీలకమైనది ఆర్థిక పరిస్థితి. గతంలో చేసిన చట్టాలు, విధానాల ప్రకారం రేపు జనవరి ఒకటో తేది నుంచి పన్నులు పెంచవలసి వుంటుంది. కొన్ని ప్రజా సంక్షేమ పథకాలలో కోత విధించవలసి వస్తున్నది. అవి రెండూ ప్రజలలో వ్యతిరేకత తెస్తాయి. పైగా ఆయనకు కాంగ్రెస్ సభలో ఆధిక్యత లేదు. రిపబ్లికన్ల సహకారం వుంటే తప్ప ఏ పనీ జరగదు. వారి నుంచి దాన్ని సేకరించడం రాజకీయంగా చాలా కష్టమైన పని. నిరుద్యోగ సమస్యకు తక్షణ పరిష్కారం కనుగొనాలి. వస్తువుల ఉత్పత్తి రంగానికి ప్రాధాన్యత ఇవ్వడం ద్వారా ఆ సమస్య పరిష్కరిస్తానని చెప్తున్నాడు ఒబామా. చైనా, తైవాన్, కొరియా, జపాన్ వంటి దేశాల నుంచి వస్తున్న దిగుమతులను నియంత్రిస్తే తప్ప అది సాధ్యం కాదు. అమెరికన్ సూపర్ మార్కెట్లలో నూటికి తొంభై శాతం వస్తువులు ఈ దేశాల నుంచి వస్తున్నవే కావడం గమనార్హం. ఆ దిగుమతులను నిరోధించడం అంటే ఆ

కొరవ 14వ పేజీలో



జమీన్‌రైతులో వాస్తు సందేహాలు శీర్షిక నిర్వాహకుడు పాయసం సుబ్రహ్మణ్య మహర్షి, దేవకీరాణిల కుమార్తె మాధురి ప్రియాంక, మిథున్‌ల వివాహం నవంబర్ 1తేది నెల్లూరు ఎంసిఎస్ కళ్యాణ మండపంలో జరిగింది.



సరస్వతీ నిధికి 25వేల రూపాయల విరాళాన్ని జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డికి అందజేస్తున్న లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ సేవా సమితి జిల్లా కన్వీనర్ తుంగా పాండురంగారెడ్డి.




నెల్లూరులో జరిగిన కేంద్ర హోంశాఖ వ్యవహారాల పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ సమావేశంలో మాట్లాడుతున్న ఆ కమిటీ ఛైర్మన్ ఎం.వెంకయ్యనాయుడు.




జిల్లాలో మత్స్యకారులు ఎదుర్కొంటున్న సమస్యలపై కేంద్ర హోంశాఖ వ్యవహారాల పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ ఛైర్మన్ ఎం.వెంకయ్యనాయుడుకు వినతిపత్రం ఇస్తున్న కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు.

# వారఫలాలు

*తేది 10-11-2012 నుండి 17-11-2012 వరకు వృషభంలో గురు, కేతువులు; కన్యలో శుక్రుడు; తులలో శని, రవి 17తేది నుండి వృశ్చికంలో; వృశ్చికంలో బుధ, రాహువులు; ధనుస్సులో కుజుడు; కన్య, తుల, వృశ్చిక, ధనుస్సులలో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

నూతనోత్సాహంతో ముందుకు సాగుతారు. కొన్ని పనులు వాయిదా పడుట, అనవసర తగాదాలు, మిత్రులు శత్రువులుగా మారుట జరుగుతుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి అధికారుల ఒత్తిడి పెరుగుతుంది. ఆర్థికంగా పుంజుకుంటారు. విద్యార్థులు తమ జ్ఞాపకశక్తిని వృద్ధి చేసుకొంటారు. వ్యవసాయదారులకు అదనపు ఖర్చులు. రాజకీయులు ముఖ్య కార్యాలు పూర్తి చేస్తారు.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

రుణ, శత్రు సమస్యలకు పరిష్కారాలుండవు. ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి. ఇతరులతో మాట్లాడేటప్పుడు జాగ్రత్త. స్థిరాస్తి విషయాలలో సోదరసోదరీలతో భేధాభిప్రాయాలుంటాయి. అవివాహితులకు వివాహ యోగం. వ్యవసాయదారులు పనులలో మెళకువ పాటించాలి. కళా, క్రీడా రంగాలలోని వారికి కార్యసిద్ధికి ఆటంకాలు. రాజకీయాలలోని వారు అపనిందలు రాకుండా చూసుకోవాలి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు1,2,3 పా

ఇతరులను విమర్శించడం తగ్గించాలి. స్వంత నిర్ణయాలు ఫలించవు. స్త్రీలకు ఈవారం ప్రయోజనకరంగా వుంటుంది. వృత్తి, వ్యాపారాలు బాధ్యతతో నిర్వహించాలి. విద్యార్థులు కొన్ని విషయాలలో మౌనం పాటించడం మంచిది. వ్యవసాయదారులు తమ పనులపై ప్రత్యేక దృష్టి పెట్టాలి. కళా, క్రీడా రంగాలలోనివారు ముఖ్య నిర్ణయాలు తీసుకొనేటప్పుడు ఇతరులతో సంప్రదించడం మంచిది.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

పనులలో క్రమంగా అనుకూలతలు పొందగలరు. ఆదాయ వ్యయాలు సమానంగా వుంటూ ఇంటాబయట మధ్యమానుకూలతలు పొందగలరు. నూతన గృహనిర్మాణాది ఆలోచనలు శుభాన్నిస్తాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆశాజనకంగా వుంటుంది. అభివృద్ధి అంశాలపై దృష్టి పెట్టండి. పిత్రార్జిత విషయాలలో వివాదాలు రాగల సూచనలున్నాయి. వ్యవసాయదారులకు తమ పనులపై శ్రద్ధ అవసరం.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

పనులు నిరాశాజనకంగా వుండి, ఉత్సాహం తగ్గుతుంది. స్పెక్యులేషన్ రాణించదు. కోర్టు వ్యవహారాలు మనస్సును కలవరపెడతాయి. ఇంట్లో తలపెట్టిన శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాలలో ఇతరుల వల్ల ఆటంకాలు రాకుండా చూసుకోవాలి. విద్యార్థులకు విద్యపై మనోనిబ్బరం పెరుగుతుంది. వ్యవసాయదారులకు అనుకూలతలు సిద్ధిస్తాయి. రాజకీయులకు అనుకూలం కాదు.



**కన్య**
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్తా 1, 2 పా

పనులలో మిశ్రమ ఫలితాలుంటాయి. ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి. స్థిరాస్తి, గృహనిర్మాణాది పనులపై ఖర్చులు పెరుగుతాయి. ధన, వాహన, వస్తువుల నష్టం. అకాల కలహాలకు దూరంగా వుండడం మంచిది. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో లోపాలు పెరగగలవు. విద్యార్థులు తమ తోటి విద్యార్థులతో వివాదాలు, సంఘర్షణలు రాకుండా చూసుకోవాలి.



**తుల**
చిత్తా 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

గతవారం వలె వున్నా పనులలో శుభాశుభ మిశ్రమాలుంటాయి. బంధుమిత్రుల వల్ల కొన్ని ప్రయోజనాలు సాధిస్తారు. అదనపు బాధ్యతలు పెరిగినా సమర్ధించుకొంటారు. ఆర్థిక వ్యవహారాలలో ముందు జాగ్రత్తలు అవసరం. ఇంట్లో సానుకూలతలుంటాయి. వృత్తి, వ్యాపారాలు ఆశాజనకం. విద్యార్థులు తమ ఆంతరంగిక విషయాలు బహిర్గతం చేయవద్దు. కోర్టు వ్యవహారాలు మనస్సును బాధిస్తాయి.



**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

పనులలో జాప్యం, ఆదాయానికి మించిన ఖర్చులు వుంటాయి. కొన్ని విషయాలలో ఇతరులచే దగాపడుట, ఉద్యోగులకు పై అధికారుల ఒత్తిడి వుంటాయి. భార్యభర్తల మధ్య మనస్పర్థలుంటాయి. విద్యార్థులకు శ్రమకు తగ్గ ఫలితం వుంటుంది. వ్యవసాయదారులకు సమయస్ఫూర్తి అవసరం. రాజకీయులు ప్రశంసలకై ఆరాటపడవద్దు. శ్రమకు తగ్గ ఫలితముంటుంది.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

పనులలో విజయం సాధించి, సామాన్య అనుకూలతలు పెరిగి ప్రయోజనం పొందుతారు. వృత్తి, వ్యాపారాల వారికి ఆర్థికస్థితి బాగున్నా, అధికారుల ఒత్తిడులు మానసికంగా బాధిస్తాయి. కోర్టు వ్యవహారాలు వాయిదావేయడం మంచిది. విద్యార్థులు వ్యాసాంగాలకు ఆటంకం రాకుండా చూసుకోవాలి. వ్యవసాయదారులు అవసరానికి రుణం చేయవలసి వస్తుంది. రాజకీయుల రహస్య చర్చలు విఫలమౌతాయి.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

తలపెట్టిన పనులు సకాలంలో పూర్తి చేయగలరు. వృత్తి, వ్యాపారాలలో లాభాలకనుకూలం. ఇంటా బయట అప్పులతో, బంధుమిత్రులతో ఆనందంగా గడపగలరు. ఉద్యోగులు పైఅధికారులతో అనుకూలతలు సాధించగలరు. విద్యార్థుల నూతన ఆలోచనలు ఫలిస్తాయి. వ్యవసాయదారులు రాబడి పెరిగి ఆనందోత్సాహాలతో వుంటారు. కళా, క్రీడా రంగాలలోని వారు అభివృద్ధిలో ముందంజలో వుంటారు.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

పనులు వేగంగా పూర్తయ్యి, ఆర్థిక వ్యవహారాలు అనుకూలిస్తాయి. వృత్తి, వ్యాపారాలలోని వారి నూతన యత్నాలు ఫలించే సమయం. ఉద్యోగులకు పైఅధికారుల మధ్యనున్న స్పర్ధలు తగ్గగలవు. నూతన వస్తు, వాహనాలు కొనుగోలు చేయగలరు. వ్యవసాయదారులకు గిట్టుబాటు ధరలుంటాయి. కళా, క్రీడా రంగాల వారిని రుణ బాధలు పీడిస్తాయి. స్వల్ప విషయాలలో కూడా అంచనాలు తారుమారవుతాయి.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

ఫలితాలు సామాన్యంగా వుండి, ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి. స్పెక్యులేషన్లు రాణించవు. వృత్తి, వ్యాపారాలలోని వారు ప్రతి పనిలోనూ శ్రమ వున్నా ప్రయోజనం పొందగలరు. సాహస కార్యాలకు దూరంగా వుండడం శ్రేయస్కరం. కుటుంబ వ్యవహారాలలో శ్రద్ధ అవసరం. విద్యార్థులకు నూతన మిత్రులేర్పడి మానసిక ఒత్తిడి తగ్గి ప్రోత్సాహకరంగా వుంటుంది.

## పంచాంగం

11తేది గోవత్స ద్వాదశి.

12తేది మాసశివరాత్రి, తెల్లవారుజామున నరక చతుర్దశి, ప్రయుక్త తైలాత్యంగము.

13తేది దీపావళి, ధనలక్ష్మీపూజ, కేదార వ్రతము (గౌరీ పూజ).

13తేది ఆకాశదీప ప్రారంభం.

16తేది మొహర్రం పండుగ. 1344 హిజ్రీ ప్రారంభం.

17తేది నాగుల చవితి.

### శుభ ముహూర్తాలు

16, 18తేదీలలో వివాహ, నూతన గృహారంభ, క్రయవిక్రయాది గృహ ప్రవేశాలు, సామాన్య శుభకార్యాలకు శుభ ముహూర్తాలున్నాయి.

### నవంబర్ తిథులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | ఆశ్వయుజ బహుళ | | | |
| 10 | శని | ఏకాదశి | ప | 03.47 | గం.ల.వ |
| 11 | ఆది | ద్వాదశి | ప | 01.27 | గం.ల.వ |
| 12 | సోమ | త్రయోదశి | ప | 10.32 | గం.ల.వ |
| 13 | మంగళ | చతుర్దశి | ఉ | 07.12 | గం.ల.వ |
| | | అమావాస్య | తె | 03.37 | గం.ల.వ |
| | | కార్తీక శుద్ధ | | | |
| 14 | బుధ | పాడ్యమి | రా | 12.11 | గం.ల.వ |
| 15 | గురు | విదియ | రా | 08.17 | గం.ల.వ |
| 9 | శుక్ర | తదియ | సా | 04.53 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

# ‘జ్యేష్ఠాపంచక’ దంపతీ వివాహం శాస్త్ర నిషిద్ధం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్యా మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎన్.షణ్ముఖశాస్త్రి — తిరుచానూరు*

** జ్యేష్ఠ నక్షత్రం వచ్చిన వధూవరుల వివాహం చేయకూడదా?*

త్రిజ్యేష్ఠ, జ్యేష్ఠ చతుష్టయం, పంచకం వచ్చిన వారి వివాహాలు కూడదని శాస్త్ర నిర్వచనం. మీర డిగింది జ్యేష్ఠ పంచకం. అంటే వధూవరులు జ్యేష్ఠులై, జ్యేష్ఠ నక్షత్రము కలిగి, జ్యేష్ఠ మాసంలో వివాహం కూడదనే శాస్త్రాలు చెబుతున్నాయి.

*టి.శ్రీనివాసరావు — కర్నూలు*

** గృహానికి ఉత్తరం రామాలయం ఉన్నది. గోపురం లేదు.*

ఆలయానికి నాలుగు వీధుల్లోనూ గృహాలు నిషిద్ధం. గోపురం లేనప్పటికీ నిర్ణీత యంత్ర ప్రతిష్ట చేసుకోకపోతే సుఖంగా ఉండలేరు.

*అరిపిలి జనకయ్య — శ్రీకాళహస్తి*

** ఇంటికి తూర్పు ఉత్తరాలు ఎక్కువ స్థలం ఉండవచ్చా?*

దక్షిణ పశ్చిమ స్థలాలకు రెట్టింపు స్థలం మాత్రమే శాస్త్రం సమ్మతిస్తున్నది. 'అత్యధికం అతినాశాయ' అని పెద్దలు అంటారు.

*డాక్టర్ భార్గవరావు — చెన్నై*

** జ్యోతిశ్శాస్త్రంలో 'షడశీతి' అనే పదాన్ని చదివాను. ఏ డిక్షనరీల్లోనూ విశేషార్థం వివరించలేదు.*

సూర్యుడు రాశులలో ప్రవేశించడాన్ని 'సంక్రమణం' అంటారు. సూర్యుడు మిథున, కన్య, ధను రాశుల సంక్రమణం చెందడాన్ని 'షడశీతి' అంటారని 'వశిష్ట ధర్మసింధు' గ్రంథం పేర్కొంటున్నది.

*ఎన్.శైలజ — గూడూరు*

** మరణం తర్వాత 'మైల' ఆత్మను గురించి చెప్పండి?*

మృత్యువాత పడిన 'ఆత్మ' పది రోజులపాటు గృహాన్ని అంటిపెట్టుకొని ఉంటుంది. అందువల్ల పదకొండవరోజు వరకూ మైలపూజలు చేయరాదని 'ధర్మసింధు' గ్రంథం చెబుతోంది.

*వై.సి.జయకాంతన్ — చెన్నై*

** 'తులసి' ప్రశస్తిని గురించి చెప్పండి?*

బహుమంజరి, శూలఘ్ని, సురసా, సురభిళ వంటి పేర్లున్న తులసి ఆరోగ్యరీత్యా విలువైన ఔషధ గుణాలను కలిగి ఉన్నది.

*డి.వామనమూర్తి — అనంతపురం*

** 'విధి'ని గురించి, వాస్తు, జ్యోతిష్యాలను గురించి చెప్పండి?*

వాస్తు, జ్యోతిష్యాల ప్రభావం యాభై శాతమని, విధి లిఖితం మరో యాభై శాతమని నా అభిప్రాయం. ప్రాజ్ఞులెవరైనా ఈ అభిప్రాయాన్ని నమ్ముతారు.

*ఎం.సుమతి — తడ*

** ఉత్తరంవైపు ఎక్కువ ఖాళీ జాగా ఉన్నది. అయినా ఆర్థిక పరిస్థితి బాగోలేదు.*

'అధికస్య అధిక ఫలం' అని మీరు అనుకొని ఉంటారు. ఉత్తరం కుబేరస్థానం అధికంగా పెరగడం వల్ల ఆర్థిక సమస్యలు తలెత్తుతాయి.

*రాధికారెడ్డి ఎం — ఆలూరుపాడు*

** వివాహం ఆలస్యమవుతున్నది. మీ సలహా చెప్పండి?*

మగ పెళ్లివారి అత్యాశలు, మిడిమిడి శాస్త్ర జ్ఞానాలు, ఛాందసాలు అన్నీ వెరసి అమ్మాయిల పట్ల శాపాలుగా పరిణమిస్తున్నాయి. మీరు సంస్కారవంతమైన కుటుంబాలలో ప్రయత్నించండి. ఒక్క సంవత్సరంలోపు అమ్మాయికి వివాహ యోగం వుంది.

*వై.శకుంతల — కోవూరు*

** లగ్నబలం గొప్పతనమేమిటి?*

కూటమి, రాశి, వర్గులాంటి విభాగాలలో దోషాలున్నప్పటికీ వధూవరులకు లగ్నబలం బలీయంగా ఉంటే నిస్సందేహంగా వివాహం చేయవచ్చు.

*సి.ప్రభుదాసు — నెల్లూరు*

** రెండు నదీపాయల మధ్య ఉన్న గ్రామాన్ని ఏమంటారు. ఆ అంశం ఏ గ్రంథంలోనిది.*

"అపరాజవృచ్ఛ" వాస్తు గ్రంథంలో ఇలాంటి గ్రామం, నగరాలను 'మహాజయం' అన్నారు.

# వైద్య ఆరోగ్య సిబ్బందిలో "మార్పు" సాధ్యమా?

**మాతా, శిశు మరణాలు తగ్గించేందుకు జిల్లా వైద్య ఆరోగ్య శాఖ నేతృత్వంలో 'మార్పు' పథకానికి శ్రీకారం చుట్టారు. కానీ ప్రజారోగ్యం కోసం వందల కోట్ల రూపాయలు ఖర్చుపెడుతున్నా ఆరోగ్య సిబ్బందిలో విధుల పట్ల నిర్లక్ష్యం ప్రతి పథకాన్నీ విఫలమయ్యేలా చేస్తుంది.**



నిరంతరం వార్తల్లో జిల్లా వైద్య ఆరోగ్య శాఖ కార్యాలయం.

జిల్లాలో మాతా, శిశు మరణాలు తగ్గించేందుకు జిల్లా వైద్య ఆరోగ్య శాఖ కొత్త పథకానికి శ్రీకారం చుట్టింది. మండల స్థాయిలో వైద్య, ఆరోగ్య శాఖకు అనుబంధంగా పనిచేసే పలు శాఖల సమన్వయంతో కార్యాచరణను రూపొందించి అమలు చేయాలని అధికారులు నిర్ణయించారు. ఇటీవల వైద్య ఆరోగ్య శాఖ ఆధ్వర్యంలో అనుబంధ శాఖల అధికారులతో సదస్సు నిర్వహించి కొత్తగా అమలు చేసే పథకానికి "మార్పు" అనే పేరును ఖరారు చేయడం జరిగింది. ప్రధానంగా మాతా, శిశు మరణాలను తగ్గించాలన్నది "మార్పు" ఉద్దేశం. గ్రామస్థాయిలో వైద్యం మెరుగు పరచేందుకు అనుబంధ శాఖల సహకారం తీసుకుంటారు. ఇందులో మండల పరిషత్ అభివృద్ధి అధికారి, స్త్రీ, శిశు సంక్షేమ శాఖ, గిరిజన సంక్షేమ శాఖ, త్రాగునీటి సరఫరా విభాగం, గ్రామ పంచాయితీలు ఉంటాయి.

ఎప్పటి నుంచో గ్రామీణ ప్రాంతాల్లో మాతా, శిశు మరణాలు సంభవిస్తూనే ఉన్నాయి. వీటిని నియంత్రించేందుకు అనేక చర్యలు తీసుకున్నా సిబ్బంది సక్రమంగా పనిచేయలేక పోయారన్న అభియోగాలు ఉన్నాయి. ఇటీవల నిర్వహించిన "మార్పు" సదస్సుకు హాజరైన జిల్లా కలెక్టర్ కూడా ఇదే విషయాన్ని ప్రస్తావించారు. ప్రతి సంవత్సరం ప్రజల వైద్యం కోసం కోట్ల రూపాయల నిధులు ఖర్చు చేస్తున్నా ఆరోగ్య సిబ్బంది విధుల పట్ల అంకితభావంతో పనిచేయడం లేదని కలెక్టర్ ఘాటుగా విమర్శించారు. ఇక నుంచి క్షేత్రస్థాయిలో ఉమ్మడి కార్యాచరణ ప్రణాళికతోనే పనిచేయాలని ఆదేశించారు. ఏ గ్రామంలోనైనా మాతా, శిశు మరణాలు సంభవిస్తే అక్కడి వైద్య సిబ్బందిపై కఠిన చర్యలు తీసుకోవడం జరుగుతుందని హెచ్చరికలు కూడా చేశారు. వైద్య ఆరోగ్యశాఖ సిబ్బందికి హెచ్చరికలు చేయడం మామూలే నని సదస్సులో పాల్గొన్న వైద్యాధికారులు వ్యాఖ్యానించుకోవడం విశేషం.

## అవగాహన అవసరం

జిల్లాలో మాతా, శిశు మరణాల్లో బలౌతున్న వారిలో అధికంగా చల్లా యానాదులు ఉంటున్నారు. కారణం మూఢ నమ్మకాలు, సామాజిక, ఆర్థికపరమైన వెసలుబాటు, వైద్యులు అందుబాటులో లేకపోవడం. సమీపంలో ఉన్న ప్రైవేటు, రిజిష్టర్ మెడికల్ ప్రాక్టీస్ చేస్తున్న వారిని కాన్పులు, ఇతర వైద్యం కోసం ఆశ్రయించడం కూడా మరో కారణంగా చెప్పవచ్చు. క్షేత్రస్థాయిలో ఆరోగ్య సమస్యలపై ఎప్పటికప్పుడు ఉన్నతాధికారుల దృష్టికి తీసుకెళ్లి సత్వర చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉంది. చల్లా యానాదులు నివసించే కాలనీల్లో నివాసాలు ఇరుగ్గా ఉండడంతో కుటుంబ సభ్యులందరూ మసలుకోలేని పరిస్థితి. దీంతో చిన్న వయసులోనే బాలికలకు బాల్యవివాహాలు చేస్తుంటారు. బాల్యవివాహాల వల్ల గర్భం దాల్చిన వారు కాన్పు కష్టమై మృత్యువాత పడుతున్నారు.

## డిఎం అండ్ హెచ్‌ఓకు అధికారం

ఇక నుంచి విధుల పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరించిన వారిపై నేరుగా చర్యలు తీసుకునే అధికారం వైద్య ఆరోగ్య శాఖ అధికారికి ఉంటుంది. ఇప్పటివరకు ఎవరిపై చర్యలు తీసుకోవాలన్నా జిల్లా కలెక్టర్ అనుమతి పొందాల్సి ఉండేది. "మార్పు" కార్యక్రమం ప్రారంభం సందర్భంగా నిర్లక్ష్యం వహించిన సిబ్బందిపై డిఎం అండ్ హెచ్‌ఓ చర్యలు తీసుకునే అధికారం కలిగి ఉంటారని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ప్రకటించారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల పరిధిలోని గ్రామాల్లో ఆరోగ్య కార్యకర్తలు వారికి కేటాయించిన ప్రాంతాల్లో ప్రతిరోజూ పర్యటించి ప్రజలకు ఆరోగ్య సూత్రాలను బోధించాల్సి ఉంటుంది. అయితే వీరిలో వారానికి రెండు రోజులు మాత్రమే చుట్టపుచూపుగా గ్రామాలకు వెళ్తున్న వారు ఎక్కువ మంది ఉన్నారు.

గర్భం దాల్చిన వారు కాన్పు సమయంలో మరణించేందుకు పౌష్టికాహార లోపమే కారణమని కొందరు వైద్యులు చెబుతున్నారు. ప్రభుత్వపరంగా అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందించే పౌష్టికాహారం కొన్ని ప్రాంతాల్లో సక్రమంగా అందడం లేదు. స్త్రీ, శిశు సంక్షేమ శాఖ అధికారుల పర్యవేక్షణ లోపించడం దీనికి కారణమని అంటున్నారు. ఉమ్మడి కార్యాచరణతో ఏర్పాటుచేసిన "మార్పు" కార్యక్రమం ఏ మేరకు అమలుచేసి ఫలితాలు సాధిస్తారో వేచిచూడాలి.

ఇదో మాయాజాలం

# వాణిజ్య పన్నుల శాఖలో వే బిల్లుల మాయాజాలం!

> "నెల్లూరులోని మెజార్టీ వ్యాపారులు ఒకే వే బిల్లుతో వివిధ రకాల సరుకులను ఎగుమతి, దిగుమతి చేసుకొంటూ కోట్లాది రూపాయల పన్నును ప్రభుత్వానికి ఎగగొడుతున్నారు. దీనికిగాను స్టోన్‌హౌస్‌పేటలోని ఆయిల్ మిల్లుల వ్యాపారి మధ్యవర్తిగా వ్యవహరిస్తూ లక్షలాది రూపాయలు మామూలుగా వసూలుచేసి కొంత వాణిజ్య పన్నుల శాఖాధికారులకు లంచంగా ఇస్తూ, మరికొంత తాను స్వాహా చేస్తున్నాడు."

వాణిజ్య పన్నుల శాఖ జారీచేస్తున్న వే బిల్లుల్లో అవకతవకలు జరుగుతున్నాయి. జిల్లా నుంచి తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలకు అక్రమంగా బియ్యం తరలిపోతున్నాయి. రాజకీయ ఒత్తిళ్ల కారణంగా వాణిజ్య పన్నుల శాఖ అధికారులు చర్యలు తీసుకునేందుకు ముందుకు రావడం లేదు. జిల్లా నుంచి బియ్యం ఎగుమతి చేయడంతో పాటు తమిళనాడు నుంచి పామాయిల్, పప్పుదినుసులు ఇతర నిత్యావసర సరుకులు దిగుమతి అవుతుంటాయి. వీటికి సంబంధించిన పన్నులను వాణిజ్య పన్నుల శాఖకు చెల్లించాల్సి ఉండగా తక్కువ మొత్తంలో పన్నులు చెల్లించి వ్యాపారులు ఎక్కువగా లబ్ధి పొందుతున్నారన్న ఆరోపణలు ఉన్నాయి. ఇందుకు కేంద్ర బిందువుగా నగరంలోని స్టోన్‌హౌస్‌పేటను ఏర్పాటు చేసుకున్నారు.

ఇతర ప్రాంతాల నుంచి దిగుమతి చేసుకున్న నిత్యావసర సరుకులను రహస్య ప్రాంతంలో ఏర్పాటు చేసుకున్న గోదాముల్లో భద్రపరుస్తున్నారు. బయట మార్కెట్లో కృత్రిమ కొరత సృష్టించి అనంతరం అధిక ధరలకు సరుకులను విక్రయించి సొమ్ము చేసుకుంటున్నారు. గతంలో వాణిజ్య పన్నుల శాఖ, విజిలెన్స్ అధికారులు గోదాములపై దాడులు నిర్వహించి పన్నులు చెల్లించని సరుకులను సీజ్‌చేసిన సంఘటనలు ఉన్నాయి. అయినా కూడా ఇది షరా మామూలేనని వ్యాపారస్తులు వ్యాఖ్యానిస్తున్నారు. సీజ్ చేసిన సరుకులను ఎంతో కొంత పన్ను చెల్లించి తిరిగి మార్కెట్లో విక్రయించేస్తుంటారు. వే బిల్లులు లేకుండా ఎటువంటి సరుకులను కూడా రవాణా చేయరాదు. ప్రస్తుతం వే బిల్లులను ఆన్‌లైన్ ద్వారా జారీచేస్తున్నా అవకతవకలు మాత్రం జరిగిపోతూనే ఉన్నాయి.

ఒకే వే బిల్లుతో వివిధ రకాల సరుకుల ఎగుమతి, దిగుమతి చేసుకుంటున్నారు. భీమునివారిపాళెం వద్ద ఉన్న ఉమ్మడి తనిఖీ కేంద్రంలో వే బిల్లులను పరిశీలించకుండానే అక్కడి సిబ్బంది వదిలేస్తుంటారు. దీంతో ప్రభుత్వానికి రావాల్సిన లక్షలాది రూపాయల పన్నులు రాకుండా పోతున్నాయి. వే బిల్లులు జారీచేసిన అధికారి సంతకం, తేదీలను తప్పనిసరిగా ఉమ్మడి తనిఖీ కేంద్రంలో విధులు నిర్వహించే వారు తనిఖీ చేయాల్సి ఉంటుంది. వ్యాపారస్తులతో ముందుగానే లోపాయికారీ ఒప్పందం కుదుర్చుకుని వారికి సంబంధించిన వాహనాలను వదిలేస్తున్నారన్న ఆరోపణలు లేకపోలేదు. చెక్‌పోస్టులో ఒకసారి ముద్రవేస్తే వే బిల్లు మరోసారి చెల్లదు. కాబట్టి ముద్ర వేయించకుండానే డ్రైవర్లు వెళ్లిపోతుంటారు.

అక్రమాలు నిరోధించేందుకు ప్రభుత్వం ఎన్ని నిబంధనలు విధించినా అధికారులు, సిబ్బంది రాజకీయ నేతల అండదండలతో వాటికి తూట్లు పొడుస్తున్నారు. అటు తమిళనాడు నుంచిగానీ, ఇటు నెల్లూరు నుంచి సరుకులతో వాహనం బయలుదేరిన వెంటనే చెక్‌పోస్టుకు సమాచారం వెళుతుంది. ఈ వాహనాలు చెక్‌పోస్ట్ వద్ద ఆగకుండా నేరుగా వెళ్లిపోతుంటాయి. వ్యాపారస్తుల నుంచి ప్రతినెల వాణిజ్య పన్నుల శాఖ అధికారులకు భారీస్థాయిలో ముడుపులు అందుతుంటాయి. అధికార పార్టీకి చెందిన స్టోన్‌హౌస్‌పేటలోని ఆయిల్ మిల్లుల నిర్వాహకుడు వ్యాపారస్తుల నుంచి మామూళ్లు వసూలు చేస్తుంటాడన్న ప్రచారం ఉంది. నగరంలో అధికార పార్టీకి చెందిన నేతల సిఫార్సులకు అడ్డు చెప్పేందుకు ఏ అధికారి కూడా సాహసం చేయలేని పరిస్థితి ఉంది.

పట్టించుకునే వారు లేకుండా పోవడంతో వీరు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ అక్రమాలకు పాల్పడుతుంటారు. ఎన్నో సంవత్సరాల నుంచి సాగుతున్న ఈ వ్యవహారాన్ని నియంత్రించే వారు లేకుండా పోయారు. ఫలితంగా ప్రభుత్వ ఖజానాకు జమ కావాల్సిన కోట్లాది రూపాయల పన్నులు ప్రక్కదారి పడుతున్నాయి. ఇప్పటికైనా సంబంధిత అధికారులు స్పందించి వే బిల్లుల అక్రమాలపై దృష్టిసారించాల్సిన అవసరం ఉంది.




అల్లూరు రహీం

వంద చిత్రాల మైలు రాయిని దాటిన యువహీరో శ్రీకాంత్ రాశి కన్నా వాసి గల చిత్రాలను ఎన్నుకోవాలి. కాని రాజేశ్వరి పిక్చర్ పతాకంపై ఆయన నటించిన 'లక్కీ' పరమచెత్త చిత్రం. ఏదో తీయాలని తలచి ఏదేదో తీసేసాడు దర్శకుడు హరి. ఈ చిత్రంలో ప్రథమార్థమంతా స్త్రీలపై విపరీత నిందాపర్వం కొనసాగుతుంది. దీనికి మహిళా సంఘాల నుంచి నిరసన వస్తుందని ఊహించి కాబోలు ద్వితీయార్థంలో దాన్ని కవర్ చేసే ప్రయత్నం చేశారు. ఈ సినిమాలో హీరోకు ఎదుటి వాళ్ల మనసుల్లో మాట పసికట్టే శక్తి ఒక దేవత అనుగ్రహం వల్ల కలుగుతుంది. ఆ దేవత దేవుడంటే ఇష్టప డని వారికి ఇటువంటి శక్తి ఎందుకిస్తుందో అర్థమే కాదు. అప్పటి నుంచి హీరో తన చుట్టుప్రక్కల ఉండే ఆడవాళ్ల మనసుల్లో అనుకొనే మాటలు చటుక్కున వినేస్తుంటాడు. ఎందువల్లో తెలియదు గాని దరిదాపులు వీళ్లంతా చండాల మనస్సులై ఉంటారు. హీరో ఆఫీసులో పనిచేసే ఆడవాళ్లంతా నీకు ఆంటీలు నచ్చరా? బొడ్డు ప్రక్కన పుట్టుమచ్చ, తాళాలగుత్తి నీవు చూస్తావని పెట్టుకొచ్చానంటారు. లిఫ్ట్‌లో హీరో కన్నా తక్కువ వయసులో వుండే యువతులు ఎక్కి మగవాళ్ల చూపులు మాకు కిక్కుని స్థాయి చూడవేమని స్వగతంలో అనుకొంటారు. లక్కీ సినిమాకు మాటలు వ్రాయను రచయిత పడాల శివసుబ్రహ్మణ్యం పెద్ద పిహెచ్‌డినే చేసాడనాలి. మగవాళ్లు తప్పుచేసి ఆడవాళ్లకు శిక్ష వేస్తారు. బ్రహ్మ చేసిన తొలి తప్పు అమ్మాయిని సృష్టించడం. వాళ్లు పుట్టాక వాళ్ల నిద్రపోలేదు.... ఎవర్నీ నిద్ర పోని వ్వడం లేదు. ఆడవాళ్ల అరుపులు... కుక్క మొరుగులు ఒకటే. ఆడవారు కాదు ఆడుకొనేవారు. పెళ్లాలు లేకపోవడం వల్లే అబ్దుల్ కలాం, వాజ్‌పేయి, అన్నా హజారే రాణించారు. ఆడాళ్లు ముసుగులు వేసు కొన్న ముమైత్‌ఖాన్‌లు. ఆడవాళ్లు అబద్ధం చెబితే గోడ కట్టినట్లుంది. అనేవి స్త్రీలను నిందించను వ్రాసిన డైలాగులు గాక మరేమిటి? కవరింగ్ కోసం వ్రాసిన డైలాగుల్లో దేవుడు రూపాన్ని మార్చి స్త్రీలా ఉన్నాడు. ఆడది తన మనసులోని ప్రతి ఫీలింగ్‌ను మొగు డికే చెప్పుకోవాలనుకొంటుంది.




ఈ చిత్రంలో శ్రీకాంత్ గాయకుని అవతారమెత్తి పాడిన పాట ఓరీఓరీ శం కరలో సైతం స్త్రీ నింద మంత్ర స్థాయిలో ఉంది. మిగతా పాటల గూర్చి చెప్పుకో వాల్సిన అవసరం లేదు. ఉద్యోగం చేసే వ్యక్తి రోజుకు ఏడు గంటలు పనిచేసినా సంవత్సరానికి 44రోజుల కంటే ఎక్కువ పని చేయడని రోజా చెప్పే లెక్క మాత్రం బాగుంది. చిత్రం చివరన రెండు నిమిషాల గ్రాఫిక్స్ కోసం కెమెరామెన్ వి.శ్రీని వాసరెడ్డి ఉపయోగించిన లైటింగ్ టెక్నిక్ ఏమిటో అర్థమే కాదు. తెరపై సినిమా బూజరగా కనిపి స్తుంది. అదేవిధంగా సాయి సంగీతం కూడా గందరగోళంగా ఉంది. అన్నిటికంటే విచిత్రమేమిటంటే స్త్రీలను ఒక పథకం ప్రకారం నిందించే ఈ చిత్రానికి ఒక మహిళ రాజేశ్వరి నిర్మాత కావడం విశేషం.

చిత్ర కథలోనికి వెళ్తే రోజా నడిపే ట్రావెల్ ఏజన్సీలో హీరో లక్కీ (శ్రీకాంత్) పని చేస్తుంటాడు. రోజాకు మగవాళ్లంటే ద్వేషం. ఆ పని ఈ పని చేయలేదని లక్కీని ఆమె రోజూ నిందిస్తుంటుంది. ఇం టికి రాను అతను ఎక్కిన బస్సులో కూర్చొంటే సీటు కోసం ఆడవాళ్లు లేవదీస్తారు. ఇంటికొస్తే అమ్మ (సన), నాన్న (ఎవిఎస్), నానమ్మ (రత్నప్రసాద్) భార్య, చెల్లెలు గొంతెమ్మ కోర్కెలతో చంపుక తింటుం టారు. దీంతో హీరో ఆడవాళ్లంటే అలర్జీగా ఫీలవుతుంటాడు. అరకుకు ఇంట్లో వాళ్లతో కలసి విహార యాత్రకు వెళ్లగా అక్కడ ఉండే గ్రామదేవత రాజేశ్వరమ్మ లక్కీకి ఎదుటివాళ్ల మనసుల్లో మాటలు వినే శక్తినిస్తుంది. దీనివల్ల అతను గందరగోళానికిలోనై మానసిక వైద్యురాలు(గీత)ను కలుస్తాడు. ఆమె ప్రతి మగాడు ఆడవాళ్ల హృదయం తెలుసుకోవాలని తహతహలాడుతాడు. నీకున్న ప్రత్యేక శక్తితో నాలుగు మంచి పనులు చేయమంటుంది. అప్పటి నుంచి ఆడవాళ్ల మంచికి లక్కీ ప్రయత్నించి కొం దరి జీవితాలు మార్చడంతో చిత్రం పరిసమాప్తమౌతుంది. నిర్మాతలు సినిమా తీసేది పది రూపాయలు సంపాదించను. లక్కీ లాంటి సినిమాను నిర్మాతలు డబ్బు పోగొట్టుకోనే తీశారనక తప్పదు.



## తెలుగు చిత్రాలకు దూరం కాను!

స్టార్ హోదా దక్కించుకోవడం అంత సామాన్యమైన విషయం కాదు. ముఖ్యంగా హీరోయిన్లు తొలి అడుగు తడబడిన తర్వాత తేరుకొని... నిలదొక్కు కొని... దూసుకుపోవడం తమన్నాకే చెల్లిందనాలి. హ్యాపీడేస్ తర్వాత వరుసగా చిత్రాలు చేస్తూ అగ్రహీరోయిన్ల సరసన స్థానం సంపాదించుకొంది. హిమ్మత్ వాలా సినిమాతో హిందీలోనూ హల్‌చల్ చేయడానికి సిద్ధమైపోయింది. ఇక మీ దృష్టి బాలీవుడ్ పైనేనా? అని ఆమెనడిగితే సమాధానంగా ప్రస్తుతం అక్కడ ఒక్క సినిమానే చేస్తున్నాను. ఆ సినిమా ఫలితంపైనే బాలీవుడ్‌లో నా భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. అక్కడ ఎన్ని సినిమాలు వచ్చినా దక్షి ణాదికి దూరం కాను. ఎందుకంటే.... ఈ పరిశ్రమలో నేను మమేకం అయిపోయాను. నేను ఇంగ్లీషు మాట్లాడినా అందులో తెలుగు యాస వచ్చే స్తోంది. అప్పుడప్పుడు బాలీవుడ్‌కు వెళ్లి వస్తా నంతేనని ఆమె తేల్చి చెప్పేసింది.

## విలువిద్యా ప్రవీణా!

జర్నీ సినిమాతో తెలుగువాళ్లకు తెలిసిన మళయాళ నటి అనన్య. ఆ చిత్రంలో శర్వానంద్‌ను ప్రేమించే హీరోయిన్‌గా కనిపిస్తుంది. అనన్య ప్రతిభ కేవలం నటనకే పరిమితం కాలేదు. ఆమెకు విలు విద్యలోనూ ప్రావీణ్యముంది. ఏదో సరదాకు నేర్చుకొన్న విద్య కాదట. అందులో జాతీయస్థాయి పోటీలకు వెళ్లేంత ప్రతిభ అనన్యకు ఉంది. ఇటీవల కేరళలోని కన్నూర్‌లో నిర్వహించిన పోటీల్లో ఆమె పతకాలు సాధించింది. జాతీయ ఆర్చరీ ఛాంపియన్ పోటీల్లో పాల్గొనేందుకు అర్హత సాధించింది. దీనిపై అనన్య మాట్లా డుతూ ఇది సంతోషకరమైన వార్త. అక్కడ కూడా నెగ్గేందుకు కష్టపడతానంది. ప్రస్తుతం అనన్య తెలుగులో ఇం టింటా అన్నమయ్య చిత్రంలో నటించబోతోంది. ఈ సినిమాకు దర్శకుడు కె.రాఘవేంద్రరావు. శ్రీరామరాజ్యం చిత్ర నిర్మాత యలమంచిలి సాయిబాబు కుమారుడు రేవంత్ హీరో.



## పౌరాణిక పాత్ర వస్తే ఓకే!

మరోసారి అవకాశం వస్తే పౌరాణిక చిత్రంలో చేస్తానని హీరోయిన్ నయనతార చెప్పింది. రాజా రాణి చిత్రం షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. శ్రీరామరాజ్యం చిత్రంలో నా నటనకు ప్రశంసతోపాటు ప్రభుత్వ పురస్కారాలు రావడం నూతనోత్సాహాన్ని ఇచ్చింది. బాలకృష్ణ, బాపుగారు నా మీద నమ్మకం ఉంచబట్టే నేను సీత పాత్రలో బాగా నటించగలిగాను. దీనికిగాను వారికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. మళ్లీ ఎప్పుడైనా అవకాశం వస్తే పౌరాణిక పాత్రలు పోషణను వదులుకోనని నయనతార స్పష్టం చేసింది.

## ఐ కోసం సిక్స్‌ప్యాక్!



అపరిచితుడు తర్వాత హీరో విక్రమ్ దర్శకుడు శంకర్ కాంబినేషన్‌లో 'ఐ' చిత్రం రూపుదిద్దుకొంటుంది. తెలు గులో ఈ చిత్రానికి మనోహరుడుగా పేరు పెట్టారు. అమీజాక్సన్ హీరోయిన్. చైనాలో గత రెండు నెలలుగా ఈ చిత్రం షూటింగ్ జరుగుతుంది. ఎన్నికలు, పాలనా వ్యవస్థ చుట్టూ తిరిగే కథాంశంతో తయారయ్యే ఈ చిత్రం కోసం విక్రమ్ సిక్స్‌ప్యాక్ బాడీని సిద్ధం చేసుకొన్నాడు. అన్నట్లు ఈ చిత్రానికి ఎ.ఆర్ రెహ్మాన్ సంగీత దర్శకుడు.

## సౌందర్య ఆస్తుల వివాదం



8ఏళ్ల క్రిందట హెలికాప్టర్ ప్రమాదంలో దుర్మరణం పాలయ్యింది హీరోయిన్ సౌందర్య. అందులోనే ప్రయాణిస్తున్న ఆమె అన్న అమర్‌నాథ్ కూడా చనిపో యారు. ఇప్పుడు ఆమె 50కోట్ల రూపాయల విలువైన ఆస్తుల విషయంలో వివా దం నెలకొంది. సౌందర్య తల్లి మంజుల, భర్త రఘు ఒక పక్షం. అమర్‌నాథ్ భార్య నిర్మల, వారి కుమారుడు సాత్విక్ మరో పక్షం. బెంగళూరు, హైదరాబాద్‌లో ఉన్న ఆస్తుల్లో సౌందర్యతో అమర్‌నాథ్‌కు భాగం ఉందని నిర్మల తరపువాళ్లు చెబుతున్నారు. తమకు న్యాయంగా రావాల్సిన ఆస్తిని ఇచ్చేందుకు మంజుల, రఘు అంగీకరించడం లేదని వారంటున్నారు. ఈ మేరకు బెంగళూరులోని సదాశివనగర్ పోలీస్‌స్టేషన్‌లో కేసు దాఖలు చేశారు. వీరికి వ్యతిరేకంగా మంజుల పక్షం కూడా ఓ కేసు పెట్టింది. ఇప్పుడీ వివాదం కోర్టు ముంగిటకు చేరింది.

# అవినీతితో వ్యవస్థ నాశనం!

## నెల్లూరులో సెర్ప్ సిఇఓ రాజశేఖర్


సమీక్షా సమావేశంలో సెర్ప్ సిఇఓ రాజశేఖర్.

పేద కుటుంబాలను ఆదుకొనేందుకు, వారికి న్యాయం చేసేందుకు ఏర్పాటైన సంస్థల్లో అవినీతి పెచ్చుమీరుతోందని సెర్ప్ సిఇఓ, సీనియర్ ఐఏఎస్ అధికారి రాజశేఖర్ వ్యాఖ్యానించారు. ఎవరికి వారు అవినీతికి పాల్పడుతుంటే వ్యవస్థ నాశనం అవుతుం దన్నారు. నీలం తుఫానుపై ప్రత్యేకాధికారిగా వచ్చిన ఆయన పనిలోపనిగా స్థానిక డిఆర్‌డిఏ సమావేశ మందిరంలో జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, ఇందిర క్రాంతి పథం, జిల్లా సమాఖ్య తదితర విభాగాల పనితీరుపై అధికారులతో సమీక్షించారు. జిల్లా సమాఖ్య పనితీరుపై మాట్లాడుతూ పలు అంశాలను ప్రస్తావించిన ఆయన అందులో జరుగుతున్న అవి నీతి అక్రమాలపై ఒక్కసారిగా భగ్గుమన్నాడు. అన్ని విభాగాల్లో అవినీతి పెరిగిపోతోందన్నారు. ఎపి, విపిఎం, డిపిఎంల కబంధహస్తాల నుంచి బయట పడి సమాఖ్య సభ్యులు సొంతంగా వ్యవహరించాల న్నారు. ఎక్కడెక్కడ, ఏ స్థాయిలో అవినీతి జరుగు తుందో తనకు అంతా తెలుసని, తన వద్ద పూర్తి సమాచారం ఉందన్నారు. సిబ్బంది గ్రామాలకు వెళ్ల కుండానే పనిచేస్తున్నట్లు రికార్డులో వ్రాసుకోవడం లేదా అంటూ సూటిగా ప్రశ్నించడంతో సమావేశా నికి హాజరైన వారు కిక్కురుమనకుండా ఉండిపో యారు. గ్రామీణ ప్రాంతాల్లోని పేద మహిళలను ఆర్థికంగా అభివృద్ధి చేయాలనే లక్ష్యంతో ప్రారంభిం చిన ప్రాజెక్టు కొందరు అవినీతిపరుల వలన దెబ్బ తింటున్నదని ఆగ్రహించారు. ఇక్కడున్న ప్రతి ఒక్కరి గురించి తనకు అంతా తెలుసునని అంటూ అవినీ తికి పాల్పడే వారిపై కఠిన చర్యలు తీసుకుంటామని హెచ్చరించారు. జిల్లా సమాఖ్యకు నిర్వహణ చేతకా కపోతే పదవుల నుంచి తప్పుకొని కొత్త వారికి అవ కాశం ఇవ్వాలని సభ్యులకు సూచించారు. జిల్లా సమాఖ్య అంటే ఏమిటో జిల్లాలో పలు ప్రాంతాల ప్రజలకు తెలియదని, స్వయం సహాయక గ్రూపు లకు ఎంత రుణం తీసుకోవాలో, ఎంత వడ్డీ చెల్లిం చాలనే దానిపైన అవగాహన లేదంటే సమాఖ్య పనితీరు ఏమిటో అర్థమవుతున్నదని తీవ్ర అసం తృప్తి వ్యక్తం చేశారు. ఇప్పటికైనా తమ పనితీరు మార్చుకొని, అందరూ కలిసికట్టుగా పనిచేయాలని, అవినీతిని అంతమొందించాలని పిలుపునిచ్చారు.

# పెద్దాసుపత్రి పరిసరాలు ఘోరం!


పెద్దాసుపత్రిలోని మురికిమడుగు వద్ద వరాహాల దండు.

వచ్చిన రోగాలను నయం చేసుకొనేందుకు వచ్చే వారికి ఉన్న రోగాలు తగ్గేమాట అటుంచితే కొత్త రోగాలు వచ్చే పరిస్థితులు నెల కొన్నాయి పెద్దాసుపత్రిలో. జిల్లా ప్రభుత్వ ప్రధాన ఆస్పత్రిగా ఉన్న డిఎస్ఆర్ హాస్పిటల్‌లో ఎక్కడ చూసినా అపరిశుభ్రత తాండవి స్తోంది. పొంగి పొర్లుతున్న డ్రైనేజి, పేరుకపోయిన చెత్తాచెదారాలు, దోమలతో చూసేందుకు అసహ్యకర, అపరిశుభ్రమైన వాతావరణం నెలకొని ఉంది. పారిశుద్ధ్యం క్షీణించి అంటు రోగాలకు గురై చికిత్స కోసం ఆస్పత్రికి వస్తుంటారు సహజంగా. కానీ అక్కడకు వెళ్తే ఉన్న రోగాలకు తోడు కొత్తగా అంటురోగాల బారినపడే ప్రమాదం నెల కొని ఉంది. ఆస్పత్రిలో వివిధ విభాగాల వద్ద శుభ్రత కొరవడింది. అలాగే తినిపారేసిన ఆహార పదార్థాలు, ఆస్పత్రి వ్యర్థాలు ఎక్కడంటే అక్కడ పారేస్తుండడంతో పెద్దాసుపత్రిలో పారిశుద్ధ్యం పూర్తిగా క్షీణిం చింది. ముఖ్యంగా ఆస్పత్రి ఆవరణలో ఎయిడ్స్, హెచ్ఐవి రోగుల కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఉన్న ఎఆర్‌టి కేంద్రం వద్ద పారి శుద్ధ్య పరిస్థితి అధ్వాన్నంగా ఉంది. అక్కడేగల డ్రైనేజి కాలువలు నిండిపోయి మురుగునీరు బయటకు పొంగి పొర్లుతుండడంతో దుర్గంధం వెదజల్లుతోంది. దీనివల్ల పెద్దాసుపత్రికి వచ్చే రోగులు కొత్త కొత్త జబ్బులు తెచ్చుకోవాల్సి వస్తుంది.

# రేషన్ కార్డుల జారీపై నిర్లక్ష్యం!

రచ్చబండ కార్యక్రమం సంద ర్భంగా రేషన్ కార్డుల మంజూరుకు అనేక మంది దరఖాస్తు చేసుకున్నారు. వారికి తాత్కాలికంగా రేషన్ షాపుల నుంచి సరుకులు తెచ్చుకునేందుకు కూపన్లు జారీ చేయడం జరిగింది. రాష్ట్ర ప్రభుత్వం ఇప్పట్లో ఐరిష్ కేంద్రాలను ఏర్పాటుచేసి ఫోటోలు తీసే అవకాశం లేదని ప్రకటించిన విషయం తెలిసిందే. రేషన్ కూపన్లు పొందిన లబ్ధిదారులకు జిల్లాస్థాయిలోనే కార్డులు జారీ చేయా లని అధికార యంత్రాంగం నిర్ణయిం చింది. ఇందుకు లబ్ధిదారుల ఫోటోలు, కుటుంబసభ్యుల వివరాలతో కూడిన డిక్లరేషన్ ఇవ్వాలని కోరారు. గత నెల 10వ తేది చివరి తేదీగా నిర్ణయించిన అధికారులు ఆ తర్వాత కార్డులు జారీ చేసే ప్రక్రియ గురించి పట్టించుకోవ డం మానేశారు. చాలా సంవత్సరాల తర్వాత కొత్తగా రేషన్ కార్డులు జారీ చేస్తామని అధికారులు ప్రకటించడంతో అర్హులైన లబ్ధిదారుల్లో ఆనందం వ్యక్త మైంది. ప్రస్తుతం అర్హులకు మించి అధి కంగా దరఖాస్తులు అందడంతో ప్రక్కన పెట్టినట్లు తెలుస్తుంది. దీంతో నవంబర్, డిసెంబర్ నెలలకు సంబంధించి తాత్కా లికంగా రేషన్ కూపన్లు జారీచేసే పనిలో ఉన్నారు. రెవిన్యూ అధికారుల నిర్లక్ష్యం కారణంగానే కొత్త కార్డులు జారీ చేసేం దుకు ఆలస్యం జరుగుతున్నట్లు సమా చారం.

# స్వప్నంలా మారిన స్వగృహం

## • రాజీవ్ స్వగృహాలు ఎప్పటికి పూర్తయ్యేను?

సొంత ఇల్లు ఏర్పడుతుందన్న ఉద్దేశంతో ప్రభు త్వం నిర్మించి ఇచ్చే రాజీవ్ స్వగృహాలో దరఖాస్తు చేసుకొనే వారికి స్వగృహం ఒక స్వప్నంలా మారు తోంది. గృహ నిర్మాణ శాఖ ఆధ్వర్యంలో జరుగు తున్న ఈ గృహాల నిర్మాణం ఏళ్ల గడుస్తున్నా పూర్తి కాకపోవడంతో సొంతింటిని సొంతం చేసుకోవాల నుకొనే వారి కల కల్లవుతోంది. ఎప్పుడు ఇల్లు ఏర్ప డుతాయో తెలియక దరఖాస్తుదారులు దిక్కులు చూడాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. నగర శివారు ప్రాంతమైన కొత్తూరు సమీపంలో రాజీవ్ స్వగృహ నిర్మాణాలను 2008లో చేపట్టారు. దరఖా స్తులను వారి వారి ఆదాయాన్ని బట్టి ఇళ్లను నిర్మించి ఇవ్వాలని రాజీవ్ స్వగృహ కార్పొరేషన్‌ను ఏర్పాటు చేసింది. సొంత ఇల్లు ఏర్పడుతుందన్న ఆశతో దాదాపు 1249 మంది దరఖాస్తు చేసుకొన్నారు. ఆ ఏడాది ఇళ్ల నిర్మాణం చేపట్టిన గృహ నిర్మాణ శాఖ ఆరు నెలల్లో ఇళ్లను పూర్తిచేసి అందిస్తామని హామీ ఇచ్చింది. నాలుగేళ్లు పూర్తవుతున్నా అధికారులు చెప్పిన ఆరు నెలల గడువులు ఆరేళ్లు దాటుతున్నా ఇళ్ల నిర్మాణాలు నత్తనడకన సాగుతుండడంతో ఎప్పు టికి ఈ నిర్మాణాలు పూర్తవుతాయో అర్థంకాని పరి స్థితి ఎదుర్కొంటున్నారు దరఖాస్తుదారులు. ఆదిలోనే హంసపాదన్నట్లు నిర్మాణాలు చేపట్టిన కొద్ది రోజు లకే మొదట చెప్పిన ధరలు కాకుండా పెంచడంతో దరఖాస్తు చేసుకొన్న వారిలో చాలా మంది వెనక్కు తగ్గారు. దీంతో అధికారులు 261 ఇళ్లను నిర్మించా


అసంపూర్తిగా రాజీవ్ స్వగృహాలు.

లని నిర్ణయించారు. ఈ ఇళ్లను క్లాసిక్, ఇంట్రానిక్స్, బేసిక్, సివిక్ అనే నాలుగు రకాలుగా విభజించి నిర్మాణాలు చేపట్టింది. క్లాసిక్ విభాగంలో 3 బెడ్ రూమ్‌లతో డూప్లెక్స్ ఇళ్లు, రెండు బెడ్ రూములతో ఇంట్రానిక్స్, బేసిక్ మోడల్ ఇళ్లను, ఒక బెడ్‌రూ మ్‌తో సివిక్ మోడల్ ఇళ్ల నిర్మాణం చేపట్టినా అదు గడుగునా ఆలస్యం అవుతుండడంతో తీవ్ర జాప్యం జరుగుతోంది. సొంత ఇంటి కలను నిజం చేసుకో వచ్చన్న ఆశతో రాజీవ్ స్వగృహాలో ఇళ్లను నిర్మించు కొనేందుకు ముందుకు వచ్చిన దరఖాస్తుదారులు ఎప్పుడు ఇళ్ల నిర్మాణం పూర్తవుతుందో, ఎప్పుడు చేరుతామో తెలియక ఎదురుచూపులు చూడాల్సిన పరిస్థితి ఎదురౌతోంది.

# భగవధ్యానంతోనే ముక్తి!


విద్యార్థులకు ప్రతిభా పురస్కారాలు అందజేస్తున్న విజయానంద తీర్థ.

ప్రతిరోజు భగవంతుని ధ్యానించడం వలన కష్టాలు తొలగు తాయని మైసూరు దత్తపీఠం ఉత్తరాధికారి శ్రీ దత్త విజయానంద తీర్థ స్వామి తెలిపారు. స్థానిక కొండాయపాళెం గేటు వద్ద గల శ్రీకృష్ణ, అష్టలక్ష్మీ మందిరానికి విచ్చేసిన ఆయన భక్తులనుద్దేశించి అనుగ్రహ భాషణ చేశారు. నిత్యం భగవధ్యానం చేయడం వలన ముక్తి లభిస్తుందన్నారు. ప్రతి ఒక్కరూ దైనందిన జీవితంలో ముం దుగా ప్రత్యక్ష నారాయణుడైన సూర్యుడికి నమస్కరించాలన్నారు. సూర్యునికి మిత్ర అనే మరో పేరు ఉందని, సర్వాకాల సర్వావస్థ ల్లోనూ ఆయన తోడుంటాడన్నారు. కామ, క్రోధ, అహంకారాలను విడనాడి దేవుడిని ప్రార్థిస్తే జీవితం సుఖమయం అవుతుందని, ముక్తి లభిస్తుందన్నారు. స్వార్థ చింతనను విడనాడి దైవభక్తిని పెం పొందించుకోవాలన్నారు. సద్గురు బోధనలు విని ఆచరించేవారు ప్రశాంతమైన జీవనం సాగిస్తారన్నారు. భగన్నామస్మరణ ఆగితే శ్వాస ఆగినట్లేనని తెలిపారు. ఆలయానికి వచ్చిన దత్తస్వామికి అర్చకులు పూర్ణ కుంభంతో స్వాగతం పలికారు. అనంతరం ఆయన మందిర ప్రాంగణంలోని అష్టలక్ష్మి అమ్మవారికి, శివుడు, నాగేశ్వరస్వామి, శ్రీ కృష్ణ, ఉమాదేవికి ప్రత్యేక పూజలు చేశారు. ఈ కార్యక్రమంలో శ్రీకృష్ణ జ్ఞానబోధ సభ ట్రస్టీలు ప్రమీలమ్మ, డాక్టర్ అజయ్‌కుమార్, కొండా బలరామిరెడ్డి, అశోక్ తదితరులు పాల్గొన్నారు.

# ప్రత్యేక వైద్య పరీక్షల కేంద్రం

జిల్లా కేంద్రంలో త్వరలో ప్రత్యేక వైద్య పరీక్షల కేంద్రం ఏర్పాటుకానుంది. కేంద్ర ప్రభుత్వం రాష్ట్రంలో ఐదు జిల్లా లను ఎంపిక చేయడం జరిగింది. ఇం దులో నెల్లూరు జిల్లాను ఎంపిక చేసి తొలివిడతగా 20 లక్షల రూపాయలు కేటాయించింది. హెచ్ఐవి, మెదడు వాపు, టిబి ఇతర వ్యాధుల నిర్ధారణ కోసం ప్రజలు ఇబ్బందిపడేవారు. ప్రత్యేక వైద్య పరీక్షల కేంద్రం ఏర్పాటు జరిగితే వ్యాధి నిర్ధారణను ఉచితంగా అన్ని పరీక్షలు చేయించుకునే అవకాశం ఉంటుంది. పెద్దాసుపత్రిలోనే ఈ కేం ద్రాన్ని ఏర్పాటు చేయనున్నారు. ఈ కేం ద్రంలో విధులు నిర్వహించేందుకు ఒక డాక్టర్, ల్యాబ్‌టెక్నీషియన్, ల్యాబ్ అసి స్టెంటు, ఇతర సిబ్బంది నియామకం జరగాల్సి ఉంది. నియామకం ఆలస్యం జరిగితే డిప్యుటేషన్‌పై వైద్య, ఆరోగ్య శాఖ నుంచి అవసరమైన సిబ్బందిని నియమిస్తారు. ఈ మేరకు కేంద్ర ఆరోగ్య కుటుంబ సంక్షేమ శాఖ నుంచి జిల్లాకు ఉత్తర్వులందాయి. జిల్లాకు ఈ ప్రత్యేక వైద్య కేంద్రం సంజీవని వంటిది. ఈ వైద్య పరీక్షల కేంద్రం నిర్వహణపై ప్రత్యేక దృష్టిసారించి సక్రమ నిర్వహ ణకు ఆసుపత్రి సూపరింటెండెంట్ తగిన శ్రద్ధ తీసుకోవాల్సి ఉంది.

## పతనానికి మరొక ప్రయత్నం!

మొదటి పేజీ కొరవ

నిలుపుకొనే అవకాశమే లేదని మంత్రులతో సహ అందరూ నిర్ణయానికి వచ్చేశారు. రేపటి ఎన్నికలలో పిలిచి ఇస్తానన్నా కాంగ్రెస్ టిక్కెట్ తీసుకొనే వాడు వుండడన్నది నిజం.

ఈ నేపథ్యంలో చాలామంది కాంగ్రెస్ ఎమ్మెల్యేలు వైఎస్ఆర్ కాంగ్రెస్ టిక్కెట్ కోసం వెంపర్లాడుతున్నారు. కానీ వారి పట్ల జగన్ వైఖరి వేరుగా వుంది. ఆంధ్ర, రాయలసీమ ప్రాంతం నుంచి తన పార్టీలోకి ఎవరు రావాలనుకొన్నా టిక్కెట్ హామీ అడగకూడదని షరతు పెడుతున్నారాయన. ఒకటి రెండు చోట్ల తెలుగుదేశం ఎమ్మెల్యేలకు మాత్రమే ఈ విషయంలో మినహాయింపు లభిస్తున్నది. కాంగ్రెస్ ఎమ్మెల్యేలు ప్రజలలో పరపతి కోల్పోయారని, వారిని తన టిక్కెట్ మీద నిలబెడితే, వారి మీద వున్న వ్యతిరేకత తనకు నష్టం చేస్తుందని జగన్ భయం. అయితే తెలంగాణ ప్రాంతంలో మాత్రం ఆయన ఈ షరతు పెట్టడం లేదు. అక్కడ పరిస్థితులు వేరు కాబట్టి ఎవరు రావాలనుకొన్నా స్వాగతం చెప్తున్నాడు. ఒక్క ఆ ప్రాంతం నుంచే ఇరవై మందికి తక్కువ కాకుండా ఎమ్మెల్యేలను జగన్ పార్టీలోకి రప్పించే బాధ్యత కోమటిరెడ్డి వెంకటరెడ్డి తీసుకొన్నట్లు వినికిడి.

ఆ ఇరవై మందితో కిరణ్ ప్రభుత్వాన్ని కూల గొడితే ఢిల్లీ పెద్దలకు దిమ్మతిరుగుతుందని, తనే మిటో 2014 ఎన్నికలకు ముందుగానే విపులంగా చెప్పినట్లవుతుందని జగన్ భావిస్తున్నాడు. తనపై సిబిఐ, ఇడి పెట్టే కేసులు న్యాయస్థానాలలో నిలవవన్నది ఆయన అభిప్రాయం. కేవలం తనపై కక్షతో మాత్రమే ఈ కేసులు పెడుతున్నారు తప్ప ఒక్కదానిలోనూ తనకు శిక్ష పడేట్లు చేయలేరని, కక్షతో తనను నెలల పర్యంతం జైలులో మ్రగ్గేట్లు చేసిన కాంగ్రెస్ పెద్దలకు వారి ప్రభుత్వాన్ని కూలగొట్టడం కంటే శిక్ష వేరొకటి వుండదని జగన్ భావన. ఇప్పుడా ప్రయత్నంలో ముమ్మరంగా వున్నారాయన.

వుండబోతుంది. ఐటి రంగంలో అభివృద్ధి మందగించినా భారతదేశంలో ఇంజనీర్ల నిరుద్యోగులుగా మారిపోతారు.

ఆఫ్ఘనిస్తాన్ యుద్ధాన్ని ఎంత త్వరగా ముగించగలిగితే అంత త్వరగా ముగిస్తానని చెప్పున్నాడు ఒబామా. అయితే దానివల్ల తాలిబన్లు మరొకసారి రెచ్చిపోయే ప్రమాదం వుంది. అది భారత్, పాకిస్తాన్ దేశాలకు పెద్ద తల నొప్పి వ్యవహారం. అమెరికాకు కూడా నిత్యం అభద్రతా భావం తప్పదు.

### నల్లజాతి ప్రజల్లో ఆశలు

అమెరికాలోని నల్లజాతి ప్రజలకు ఒబామా మీద చాలా ఆశలున్నాయి. మొదటిసారి ఎన్నికైనప్పుడు తమ వాడు అధ్యక్షుడయ్యాడనే సంతోషంతో కాలం గడిపారు వారు. ఈసారి మాత్రం తమ జీవితాలలో మార్పు తెస్తాడని ఆశిస్తున్నారు. ప్రజలను జాతులుగా విడగొట్టి విధానాలు రూపొందించడం అమెరికన్ తత్వానికి విరుద్ధం. సున్నితమైన ఆ సమస్యను ఎదుర్కోవడం ఒబామాకు సర్కస్ చేసినట్లే లెక్క. నల్లజాతి ప్రజలలో నూటికి 99 శాతం నిరుపేదలు. వారి ఆదాయం చాలా తక్కువ. సమాజంలో అత్యంత తక్కువ ఉద్యోగాలతో బ్రతుకుతున్నారు వారు. అవిద్య, అనారోగ్యం, పేదరికం వారి పాలిట శాపాలు. తెల్లజాతి ప్రజలకు అసూయ కలగకుండా వారిని ఆ శాపాల నుంచి విముక్తి చేయవలసిన బాధ్యత ఒబామా మీద వుంది.

తన విజయోత్సవ ప్రసంగంలో ఒబామా ఒక నినాదం విన్పించాడు. “మమ్మల్ని గెలిపించింది మీ ఉద్యోగాల భద్రత కోసమే తప్ప మా పదవుల సౌఖ్యం కోసం కాదు” అన్నది ఆ నినాదం. రానున్న నాలుగేళ్ల పాటు ఒబామా ఎదుర్కోవలసిన సవాళ్లు ఎంత తీవ్రమైనవో ఆ ఒక్క వాక్యంతోనే వ్యక్తం చేశాడాయన. అదే నిజం కూడా.

## కాంగ్రెస్ నేతల కొంగ జపం!

మొదటి పేజీ కొరవ

నాయకత్వ మార్పు అనివార్యమని ఢిల్లీ వార్తలు సూచిస్తున్నాయి. నెల రోజుల క్రితం నాటి వలె ఇప్పుడు కూడా మర్రి శశిధర్‌రెడ్డి, డి.శ్రీనివాస్‌ల పేర్లు మాత్రమే కొత్త నాయకత్వానికి ప్రచారంలో వుండడం విశేషం. మర్రి శశిధర్‌రెడ్డికి ప్రధానితో చాలా దగ్గర సంబంధాలున్నాయి. జాతీయ విపత్తుల నివారణ సంఘం నిర్వాహకుడిగా ఎక్కువ కాలం ఢిల్లీలో గడపడం ద్వారా ఆయన టెన్ జనపథ్‌తో సైతం సాన్నిహిత్యం పెంచుకొన్నాడు. మర్రి చెన్నారెడ్డి కుమారుడు కావడం, మచ్చలేని వ్యక్తిత్వం కావడం, శత్రువులంటూ లేకపోవడం శశిధర్‌రెడ్డి అనుకూలతలు.

అయితే నాయకత్వ మార్పు అంటూ జరిగితే, గతంలో రెండుసార్లు పిసిసి అధ్యక్షుడిగా పార్టీని అధికారంలోకి తెచ్చిన తనకే అవకాశం ఇవ్వాలని డి.శ్రీనివాస్ గట్టి ప్రయత్నం చేస్తున్నాడు. తెలంగాణ ప్రాంతం, బిసి వర్గం ఆయన సానుకూలతలు.

కొత్త నాయకత్వానికి ముప్పయ్యేళ్లపాటు మంత్రిగా పని చేసిన అనుభవం కల్గిన తనకంటే మెరుగైన వారు మీకెక్కడ దొరుకుతారని వాదిస్తున్నాడు జానారెడ్డి. అయితే ఒక్క జైపాల్‌రెడ్డి తప్ప, ఢిల్లీలో ఆయన తరఫున మాట్లాడే వారు ఎవరూ లేరు.

ఇదిట్లా వుంటే తన పదవి కాపాడుకోవడానికి కిరణ్ కూడా తోచిన ప్రయత్నాలు చేస్తున్నాడు. తన కనుకూలమైన ఎమ్మెల్యేలను ఒక బృందంగా ఢిల్లీకి పంపి, ఎటువంటి పరిస్థితులలో ఈ రెండేళ్లపాటు ముఖ్యమంత్రిత్వం నిర్వహించవలసి వచ్చిందో, ఆ క్లిష్ట సమస్యలను ఎంత నేర్పుగా అధిగమించడం జరిగిందో ఢిల్లీ పెద్దలకు జ్ఞాపకం చేశాడు కిరణ్‌కుమార్ రెడ్డి. తాను కాబట్టి అటు జగన్, ఇటు తెలంగాణ ఆకర్షణలకు ఎమ్మెల్యేలు జారిపోకుండా నిలబెట్టుకోగలిగానన్నది ఆయన వాదన.

మొత్తం మీద నాయకత్వ మార్పుపై ఢిల్లీ పెద్దలు ఏ క్షణమైనా నిర్ణయం తీసుకోవచ్చునని, గతంలో రోశయ్యను దించినట్లే చెప్పా పెట్టకుండా కిరణ్‌కు కూడా ఉద్వాసన పలకవచ్చునని అంచనా వేస్తున్నారు పరిశీలకులు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

నాలు చెప్పాల్సి వస్తుంది. ఈయన హయాంలో క్లబ్ చేసిన మంచి, పనికిమాలిన పని అనుమతులు లేకుండా క్లబ్ భవనాలు విస్తరించడం ఒక్కటే. సభ్యులతో సరిగ్గా మసలక పోవడం వల్ల విచారణల ముళ్ల కిరీటాన్ని ఆయన ధరించవలసి వచ్చింది... అంతే!

### ఎర్రన్న అంత్యక్రియలకు నెల్లూరు నేతలు!

రోడ్డు ప్రమాదంలో మరణించిన తెలుగుదేశం పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు కె.ఎర్రంనాయుడి అంత్యక్రియలకు నెల్లూరుజిల్లా తెలుగుదేశం ముఖ్యనాయకులంతా శ్రీకాకుళం జిల్లాలోని ఆయన స్వగ్రామం నిమ్మాడకు వెళ్లి నివాళులర్పించి వచ్చారు. సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, బీద రవిచంద్ర, ఎమ్మెల్యేలు బీద మస్తాన్‌రావు, కురుగొండ్ల రామకృష్ణ, పరసా రత్నం, బల్లి దుర్గాప్రసాద్ తెలుగుదేశం పార్టీ జిల్లా కార్యదర్శి ఎర్రంరెడ్డి గోవర్ధన్‌రెడ్డి, గూటూరి కన్నబాబు ఈ బృందంలో ఉన్నారు.

### ఈ పుస్తకాలుంటే ఇవ్వండి!

మనసు ఫౌండేషన్ గుర్రం జాషువా సమగ్ర రచనల సంపుటం వెలువరిస్తున్నారు. 1922లో జాషువా వ్రాసిన కుశలవోపాఖ్యానం, 1943 మద్రాసు ప్రభుత్వం ప్రచురించిన రక్తగానం కవితల పుస్తకాలు మాత్రం అందుబాటులో లేవట. ఈ రచనలు ఎవరి దగ్గరైనా ఉంటే డాక్టర్ కాళిదాసు పురుషోత్తం సెల్‌ఫోన్ 09247 – 564044 నెంబరులో సంప్రదించమంటున్నారు.

### బిసి–ఇ రిజర్వేషన్‌కు వీరు అర్హులే!

మహమ్మద్, అబ్దుల్ ఇంటి పేరుగల ముస్లిం సోదరులకు బిసి–ఇ రిజర్వేషన్ వర్తిస్తుందని వెనుకబడిన తరగతుల శాఖ డైరక్టర్ సయ్యద్ ఓమర్ జలీల్ జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డికి పంపిన ప్రత్యేక ఉత్తర్వులో స్పష్టం చేశారు. ఈ ఇంటి పేర్లు గల ముస్లింలకు బిసి–ఇ సర్టిఫికేట్లు ఎమ్మార్వోలు ఇవ్వడంలేదని కృష్ణాజిల్లా ముస్లిం నేతలు చేసిన ఫిర్యాదు మేరకు స్పందించి ఆర్‌సి నెంబరు /1261/2012 పేరిట సయ్యద్ ఓమర్ జలీల్ ఉత్తర్వులిచ్చారు. కానీ మొగల్, బేగ్, పఠాన్ ఇంటి పేర్లు గల వారికి ఈ రిజర్వేషన్ వర్తించదని ఈ ఉత్తర్వులోనే స్పష్టం చేశారు. వెనుకబడిన తరగతుల శాఖ డైరక్టర్ ఇచ్చిన ఉత్తర్వులను జిల్లా వక్ఫ్ బోర్డు మాజీ అధ్యక్షుడు ఎస్.ఏ.ఎం.హుస్సేనీ జిల్లా కలెక్టర్‌కు అందించి జిల్లాలోని అందరు ఎమ్మార్వోలకు ఈ ఇంటి పేర్లుగల ముస్లింలకు బిసి–ఇ సర్టిఫికేట్లు ఇవ్వవచ్చని ఒక ఉత్తరం వ్రాయించారు.

### వినూత్న ఆహ్వాన పత్రిక

మనసుంటే ఎన్నో రకాలుగా ఆహ్వాన పత్రికలను తయారు చేయవచ్చని నిరూపించాడు మసూద్. డిఆర్‌డిఏలో పనిచేసే ఈ యువకుడికి పెళ్లి నిశ్చయం అయ్యింది. మామూలుగా దొరికే ఆహ్వాన పత్రికల్లా కాకుండా వినూత్నంగా తయారు చేయదలచి క్యాడ్‌బెరీస్ చాక్లెట్ రేపర్‌ను ఎంచుకొన్నాడు. దానిపై పెండ్లి కుమారుడు, పెళ్లి కుమార్తె పేరు ముద్రించడమేకాక, వివాహ వేదిక, సమయం, తదితర అన్ని వివరాలను ప్రింట్ చేయించడంతో చూసేందుకు కొత్తగా అన్పిస్తోంది. మూగ, చెవిటి వాడైనప్పటికీ తనలో దాగి ఉన్న కళాత్మక హృదయాన్ని తెలియజెప్పిన మసూద్‌ను పలువురు అభినందించారు.

### మిరాకిల్ వరల్డ్ రికార్డు

చేతివేళ్లతో చిత్రాలను గీయడంలో ప్రావీణ్యత చూపి వరల్డ్ రికార్డు సాధించాడు ఇందుకూరుపేటకు చెందిన రామకృష్ణ. కుంచెను ఉపయోగించకుండా చేతివేళ్లతో బొమ్మలు గీయడంలో ఆయన దిట్ట. ఇటీవల విజయవాడలో జరిగిన ఒక కార్యక్రమంలో 13 గంటల్లో 100 చిత్రాలను రూపొందించి మిరాకిల్ వరల్డ్ రికార్డుకు ఎంపికయ్యాడు.

## జనవాణి

2వ పేజీ కొరవ

కాంగ్రెస్‌పార్టీలో విలీనం చేసి ఆ పార్టీకి ఎంతో బలమిచ్చారు చిరంజీవి. రేపటి అసెంబ్లీ ఎన్నికల్లో కాంగ్రెస్‌కు ఎన్నికల ప్రచారసారథి చిరంజీవి గారే. కేంద్ర మంత్రిగా చిరంజీవి రాణించడంతోపాటు రాష్ట్రాభివృద్ధికి తనశాఖ ద్వారా చేయూతనిస్తారని ఆశిస్తున్నాను.

షేక్.జాకీర్‌హుస్సేన్ నెల్లూరు

### అవగాహన కల్పించాలి!

ప్రభుత్వం ప్రకటించిన ఇంటింటికీ మరుగుదొడ్లు, సౌరవిద్యుత్ సౌకర్యం ప్రజలకు అలవాటు చేసేందుకు ముందుగా ప్రభుత్వం చొరవ చూపాలి. ముఖ్యంగా సౌరవిద్యుత్ ఆవశ్యకతను అందరికీ తెలియజేయాలి. ప్రస్తుతం విద్యుత్ అవసరం ఏస్థాయిలో ఉందో ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. పట్టణాలతో పోల్చితే పల్లెల్లో విద్యుత్ కోతలు అధికం. కాబట్టి అక్కడి ప్రజలు అప్పు చేసైనా ఇప్పుడు ఇన్వెర్టర్లు కొనుక్కుంటున్నారు. దీనిబట్టి విద్యుత్‌కున్న డిమాండ్ ఏపాటిదో అర్థమవుతోంది. కాబట్టి సౌరవిద్యుత్ వినియోగంపై ప్రభుత్వం దృష్టి సారించి గ్రామీణుల్లో అవగాహన పెంచితే దాని వలన పగటిపూట మామూలు విద్యుత్ వినియోగం తగ్గుతుంది. పట్టణాల్లోనూ సౌరవిద్యుత్ అవసరాన్ని గట్టిగా చెప్పాల్సిన అవసరముంది. అలాగే మరుగుదొడ్ల పట్ల అంతగా గ్రామీణులు ఆసక్తి చూపించరు. కాబట్టి గ్రామాల్లో ఇంటింటికీ మరుగుదొడ్ల అవసరాన్నీ అందరికీ తెలియచేసి, వాటి వలన కలిగే ప్రయోజనాలను వివరించాలి. ఈ రెండు పథకాలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 70 శాతం సబ్సిడీలు ఇస్తాయని తెలియజేస్తే మంచి ఫలితముంటుంది.

పి.అరుణకుమారి నెల్లూరు

## నిట్టనిలువునా చీల్చిన ఎన్నికలివి !

9వ పేజీ కొరవ

దేశాలతో సత్సంబంధాలు చెడుపుకోవడమే.

భారతదేశంతో కూడా ఒబామాకు ఇటువంటి సమస్యే ఎదురు కాబోతున్నది. కంప్యూటర్ రంగంలో ఔట్‌సోర్సింగ్ విధానాన్ని వ్యతిరేకిస్తున్నాడాయన. ఆ విధానం వల్లనే మన దేశంలో ఐటి కంపెనీలు బ్రతికి బట్టకట్ట కలుగుతున్నాయి. కొన్ని లక్షల మంది యువ ఇంజనీర్లు ఉద్యోగాలు చేయగల్గుతున్నారు. వారి జీవితాల మీద ఒబామా ప్రభావం చాలా ఎక్కువగా

## పదరంగం -41

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | ■ | 4 | 5 | | 6 | ■ | 7 |
| ■ | | ■ | 8 | | | | ■ | 9 | 10 | |
| 11 | | 12 | | ■ | 13 | | ■ | ■ | | ■ |
| | ■ | | ■ | 14 | | ■ | 15 | 16 | | 17 |
| 18 | 19 | | ■ | | ■ | 20 | | | ■ | |
| ■ | | ■ | 21 | | ■ | | ■ | ■ | 22 | |
| 23 | | 24 | | ■ | 25 | | ■ | 26 | | ■ |
| 27 | | | | | ■ | ■ | 28 | | ■ | 29 |
| | ■ | ■ | | ■ | 30 | | | | ■ | |
| 31 | | 32 | ■ | 33 | | ■ | | ■ | 34 | |
| | ■ | | ■ | ■ | 35 | | | ■ | 36 | |

**అడ్డం**

1. మెలకువ (4)
4. ప్రివెంటివ్ మెజర్ (4)
8. కొత్తిమేర గింజలు (4)
9. చూడటం (3)
11. తామర పువ్వు (4)
13. ఆడ కాదు (2)
14. అటునుంచి అన్నం తినే గిన్నె (2)
15. కోరికతో (4)
18. లేమికి వ్యతిరేకం (3)
20. మూడు పదులు (3)
21. కొండ, పర్వతం (2)
22. యుద్ధం (2)
23. లాయరు పుచ్చుకునేది (4)
25. తోక (2)
26. సరియైనది (2)
27. తెలుగు డెకరేషన్ (5)
28. నదిలో ప్రయాణ సాధనం (2)
30. పురోగతికి వికృతి (4)
31. దీపం పురుగు (3)
33. చెట్టు మూలం (2)
34. రాముని భార్య (2)
35. మహారాజు షార్ట్‌కట్‌గా (3)
36. వ్యాయామం గరిడీతోపాటుగా (2)

**నిలువు**

2. ఇల్లు (3)
3. సంతోషము (3)
4. నియమించడం (4)
5. ఒక రకం చేప (3)
6. క్రింద నుంచి ఈమని శంకరశాస్త్రి వాయిద్యం (2)
7. జీవం (2)
10. ఒక్క సెకండు (3)
11. గొంతు (3)
12. నవమి తరువాత? (3)
14. మార్పు కలది (3)
15. తెలుగు ఎక్సెప్ట్ (2)
16. మనసు (2)
17. రణం కల్గి వున్న మాలిక (3)
19. రెప్పపాటు కాలం (4)
20. రోకలి (3)
21. చాతుర్యం (4)
22. రుధిరం (2)
23. మెదడులో తడబడిన ఛాన్స్ (5)
24. క్రింద నుంచి స్వప్నం (2)
26. యువకుడికి స్త్రీ లింగం (3)
28. సర్పరాజు (4)
29. అడ్డు (4)
30. క్రింద నుంచి వాయుపుత్రుడు (3)
32. ఒక మత్తు పదార్థం (2)

**సమాధానాలు**

## పదరంగం -40

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1గా | త | 2మి | ■ | 3చె | లి | 4మి | ■ | 5ప | రా | 6కు |
| ర | ■ | 7త | ను | వు | ■ | 8తా | 9ము | ■ | ■ | ను |
| 10వం | 11శ | ము | ■ | డు | ■ | 12యి | రా | 13దు | ■ | కు |
| ■ | ర | ■ | 14శా | ■ | 15కా | ■ | 16రి | ప | కా | ■ |
| 17పా | ము | ■ | 18ప | లా | య | నం | ■ | ట్టా | ■ | ■ |
| చి | ■ | 19ల్లు | ము | ■ | క | ■ | ■ | ■ | 20డం | 21పిం |
| 22క | లి | మి | ■ | 23కా | ష్టం | ■ | 24ర్చ | 25చ | ■ | ఛ |
| లు | ■ | సా | ■ | గి | ■ | 26త్రి | ■ | 27ర | 28క | ము |
| ■ | 29శా | ■ | 30మా | తం | 31గి | ■ | 32లు | కు | మే | ■ |
| 33త | క | రా | రు | ■ | ల | ■ | ■ | డు | ■ | 34మీ |
| ■ | ము | ■ | తి | ■ | 35క | వ | చం | ■ | 36గ్రా | సం |

# సంక్షిప్త సింహపురి

## వివేకాకు ఎదురు దెబ్బ!

నెల్లూరు సిటీ, రూరల్ నియోజకవర్గాల్లో ఎమ్మెల్యే వివేకానందరెడ్డికి తెలియకుండా ఏ పని జరగదు. జరిగినా ఆయన కిష్టం లేకపోతే అది ఆగిపోతుంది. నెల్లూరు బారాషహీద్ దర్గా నిర్వహణను గౌస్‌బాష అనే వ్యక్తికి వక్ఫ్‌బోర్డు లీజుకివ్వడం సంచలనం సృష్టిస్తోంది. అతను దీనికాగను చెల్లించాల్సిన మొత్తం కూడా చాలా స్వల్పంగా వుంది. గౌస్‌బాష చిన్నబజారులో పటాలు కట్టుకొనే వ్యక్తి. ఇటువంటి సామాన్యుడు అధికారులు, రాజకీయ నాయకులకు తెలియకుండా ప్రఖ్యాతిగాంచిన దర్గా నిర్వహణ బాధ్యతలు లీజు ప్రాతిపదికన తెచ్చుకోవడం మైనార్టీ వర్గాల్లో చర్చనీయాంశమయ్యింది. వివేకాకు ఈ వ్యవహారం కోపం తెచ్చిపెట్టడంతో గౌస్‌బాష దర్గా పరిసరాల దగ్గరకు కూడా వెళ్లలేకపోయాడు. ఒక దశలో వివేకాచేత ఆసిఫ్ బాష తన బినామిగా గౌస్‌బాషకు చక్రం తిప్పి ఈ లీజు ఇప్పించాడన్న ప్రచారం జరిగింది. కాని ప్రస్తుతం వివేకా లీజు ఉత్తర్వు రద్దు చేయించే పనిలో బిజీగా వున్నట్లు భోగట్టా. వక్ఫ్ బోర్డు జారీ చేసిన ఈ ఉత్తర్వుతో నగరంలోని ఎంతో విలువైన ఆస్తులను ఎవరైనా లీజు ప్రాతిపదికన తీసుకొనే అవకాశం వుందని న్యాయనిపుణులు చెబుతున్నారు.

## పొట్టి శ్రీరాములుకు నివాళి!




ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు ఆత్మకూరు బస్టాండ్ వద్ద పొట్టి శ్రీరాములు విగ్రహానికి ఎపి ఆర్యవైశ్య మహాసభ కార్యదర్శి కె.వి.చలమయ్య పూలమాల వేసి నివాళులర్పించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ అమరజీవి పొట్టి శ్రీరాములు తెలుగు మాట్లాడే వారికి ప్రత్యేక రాష్ట్రం కావాలని 58 రోజులు ఆమరణ నిరాహార దీక్ష చేసి ప్రాణత్యాగం చేసిన మహానుభావుడని కొనియాడారు. శ్రీరాములు చేసిన ప్రాణత్యాగ ఫలితమే 1956వ సంవత్సరం నవంబర్ 1తేది ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిందన్నారు. ఇటీవల పదవులు రాని కొందరు రాజకీయ నాయకులు స్వార్థ ప్రయోజనాల కోసం ప్రత్యేక తెలంగాణ కావాలని కోరుతున్నారు. ఇది వారి అవివేకానికి నిదర్శనం. ఆంధ్రప్రదేశ్ సమైక్య రాష్ట్రంగా వుండాలన్నదే మేధావుల అభిలాష అన్నారు. పొట్టి శ్రీరాములు కాంస్య విగ్రహాన్ని అసెంబ్లీ ఆవరణలో పెట్టాలని, వారి జయంతి, వర్ధంతులను ప్రభుత్వం సెలవు దినాలుగా ప్రకటించాలని, ఆయనకు భారత రత్న ఇవ్వాలని దీనికి రాష్ట్ర ప్రభుత్వం చొరవ తీసుకోవాలన్నారు. ఈ కార్యక్రమంలో ఎపి ఆర్యవైశ్య మహాసభ చీఫ్ కో ఆర్డినేటర్ తిరువీధి ప్రకాశరావు, అర్బన్ ఉపాధ్యక్షులు పి.పార్థసారథి పాల్గొన్నారు.

## వృద్ధుల ఆశ్రమానికి విరాళం!



గొలగమూడికి దగ్గర నూతనంగా నిర్మించనున్న విశాలాక్షి వృద్ధాశ్రమానికి జిల్లా ప్రజా వాకర్స్ సంఘం ప్రధాన కార్యదర్శి మండవ శ్రీనివాసరావు కుమారుడు అమెరికాలో స్థిరపడ్డ సతీష్ 500 డాలర్ల విరాళం అందించారు. అక్టోబర్ 30తేది అమరావతి హోటల్‌లోని కృష్ణారెడ్డి ఛాంబర్‌లో ప్రత్యేక కార్యక్రమం జరిగింది. ఈ సందర్భంగా కృష్ణారెడ్డి మాట్లాడుతూ శ్రీనివాసరావు కుమారులు సతీష్, సురేష్‌లిద్దరూ జన్మభూమిపై మమకారంతో అభివృద్ధి పనులకు విరాళాలు ఇవ్వడం అభినందించదగ్గ విషయమన్నారు. ఈ కార్యక్రమంలో వాస్తు రామచంద్ర, భాస్కర్‌రెడ్డి, సుబ్రహ్మణ్యం, రమణయ్య, రాజేశ్వరరావు, ప్రసాద్, శ్రీధర్, సత్యనారాయణ పాల్గొన్నారు.

## నెల్లూరుకు పెళ్లి కళ!

నెల్లూరు నగరానికి నవంబర్ 1తేది పెళ్లి కళ వచ్చింది. ఈ ఒక్కరోజే నగరంలో 200పైగా చిన్నా పెద్ద పెళ్లిళ్లు జరిగాయి. తిథి ఆశ్వయుజ బహుళ తదియ కావడంతో ఈరోజు వివాహాలు చేసుకోను వందలాదిమంది మొగ్గు చూపారు. సుమూహర్తం రాత్రి 8.33 నుండి 10.45 మధ్య వుండడంతో 10.16 నిమిషాలకు ఎక్కువ మంది మాంగల్యధారణ కార్యక్రమం కావించారు. నగరంలోని అన్ని కళ్యాణ మండపాలు, ఫంక్షన్ హాళ్లు, అవి చాలక మునిసిపల్ స్కూళ్లలోనూ పెళ్లిళ్లు జరిగాయి. పురోహితులు, మేళం, క్యాటరింగ్, పూల డెకరేషన్, కార్లకు విపరీతంగా డిమాండ్ ఏర్పడి ఆడపిల్లల తల్లితండ్రుల జేబులు ఖాళీ అయ్యాయి. జనం కూడా ఒకే ముహూర్తంలో తమకు తెలిసిన పదుగురు వివాహాలు చేసుకొంటుండడంతో వాటికి వెళ్లను ఇబ్బంది పడ్డారు. 31తేది నీలం తుఫాను పెళ్లిళ్లకు ఆటంకం అవుతుందని భావించినా అది తీరం దాటేయ్యడంతోపాటు ముహూర్తానికి ముందు వర్షం కూడా లేకపోవడంతో పెళ్లిళ్లు జరిగిన ఇంట ఆనందతాండవాలు కనిపించాయి.

## ఫెస్టివల్ ఛైర్మన్‌గా జకీర్?

నెల్లూరు బారాషహీద్ దర్గా వద్ద ప్రతి యేడు సంబరంగా జరిగే రొట్టెలపండుగ నిర్వహణ కమిటీ ఛైర్మన్‌గా షేక్ జకీర్‌హుస్సేన్‌ను నియమించవచ్చని విశ్వసనీయంగా తెలిసింది. జకీర్ హుస్సేన్ జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డిలకు కూడా ముఖ్యుడు. గత రెండేళ్లుగా ఆయన రొట్టెల పండుగ నిర్వహణ కమిటీకి ఉపాధ్యక్షునిగా కూడా పని చేశారు. యాదే రఫీ కార్యక్రమాన్ని 20ఏళ్లుగా నెల్లూరులో నిర్విఘ్నంగా చేస్తూ మైనార్టీ ప్రజల్లో ప్రత్యేక గుర్తింపు తెచ్చుకొన్నాడు. మంచివ్యక్తి అన్న పేరు కూడా వుండడంతో శ్రీధర్‌కృష్ణారెడ్డి కోరిక మన్నింపు కోసం వివేకానందరెడ్డి కూడా ఈ నియామకానికి ఒకే అనొచ్చన్న మాట వినిపిస్తుంది.



# రైతు లోకం

## నీలం తుఫాన్ - పంటల పరిస్థితి!

మన జిల్లాలో నీలం తుఫాన్ ప్రభావంతో, అక్టోబరు 31వ తేదీ నుండి నవంబరు 2వ తేదీ వరకు 92.6 మిల్లీమీటర్ల వర్షపాతం నమోదైనది. ఈ వర్షాల కారణంగా మన జిల్లాలోని వరి, కంది, మినుము మొదలగు పంటలకు ఎక్కువగా మేలు జరిగినది. ఈ వర్షాల తరువాత వరిలో ఆకు ముడత మరియు ఇనుప ధాతు లోపం గమనించడమైనది.

**ఆకు ముడత:** ఈ పురుగు నివారణకు గాను క్లోర్‌పైరిఫాస్ 2.5 మిల్లీలీటర్లు లేదా అసి ఫేట్ 1.5 గ్రాములు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి.

**ఇనుప ధాతులోపం:** దీని నివారణకు ఫెర్రస్ సల్ఫేట్ (అన్నబేది) 20 గ్రాములు మరియు నిమ్మ ఉప్పు 1.0 గ్రాములు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయవలెను. అవసరాన్ని బట్టి వారం వ్యవధిలో రెండుసార్లు పిచికారీ చేయాలి.

**మినుములో చిత్తపురుగులు:** ఈ పురుగులు ఆకులకు రంధ్రాలు చేస్తాయి. వీటి నివారణకు క్లోరిపైరిఫాస్ 2.5మిల్లీలీటర్లు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

**ఎరువుల యాజమాన్యం:** పిలకలు తొడిగే దశలో వున్న నేరుగా విత్తిన వరి పొలాల్లో ఎక్కువగా వున్న నీటిని తీసివేసి ఎకరానికి 30 కిలోల యూరియా 15 కిలోల మ్యూరేట్ ఆఫ్ పొటాష్ ఎరువులను వేసుకోవాలి.



**కలుపు నివారణ:** నేరుగా విత్తిన వరి పొల్లాలో (20–25 రోజులు) కలుపు నివారణకు బిస్‌పైరి బాక్ సోడియం అనే కలుపు మందును ఎకరానికి 100 మిల్లీలీటర్ల చొప్పున పిచికారీ చేసి నివారించుకోవచ్చు.



## ● ఒబామా గెల్చినా...

# అమెరికన్లను నిట్టనిలువునా చీల్చిన ఎన్నికలివి!



అమెరికన్ అధ్యక్ష ఎన్నికలలో బరాక్ ఒబామా అతి కష్టం మీద మళ్లీ గెలిచాడు. నువ్వా నేనా అనే రీతిలో, ఇద్దరి మధ్య ఒకటి రెండు శాతం మాత్రమే తేడాతో, చివరి నిముషం వరకు తీవ్ర ఉత్కంఠ రేపిన ఈ ఎన్నికలు అమెరికన్ చరిత్రలో ఒక కీలక ఘట్టంగా భావించవచ్చు. అందుకు కారణం – అమెరికన్ ప్రజలలో స్పష్టంగా వ్యక్తమైన విభజన. జాతి పరంగా, మత పరంగా, ఆర్థిక అంతస్తుల పరంగా, వయస్సులో తేడాల పరంగా, లింగ పరంగా అమెరికన్ ప్రజలను నిట్టనిలువునా చీల్చిన ఎన్నికలివి. భారత్ వంటి దేశాలలో వలె ఓటర్లలో చీలిక కన్పించింది.

### భిన్నజాతుల సమాహారం!

అమెరికా భిన్నజాతుల, సంస్కృతుల కలయిక. ఎక్కడెక్కడి నుంచో వలస వచ్చిన వారితో కూడు కొన్న దేశమది. ఆ వలసల పరంపర ఇప్పటికీ కొనసాగడం గమనార్హం. ప్రధానంగా అమెరికన్ ప్రజలలో తెల్లవాళ్లు, నల్లవాళ్లు, హిస్పానిక్ అమెరికన్లు, చైనీస్ అమెరికన్లు, ఇండో అమెరికన్లు, రెడ్ ఇండియన్లు వంటి జాతులు వుంటాయి. వీరిలో ఒక్క రెడ్ ఇండియన్లు మాత్రమే స్వదేశస్థులు. తతిమా వారంతా ఇతర దేశాల నుంచి వలస వచ్చి స్థిరపడిన వారే. ఇంతకాలం అమెరికన్ సామ్రాజ్యంలో ఒక్క నల్లజాతి ప్రజల పట్ల తప్ప తతిమా వారి మధ్య మానసిక, రాజకీయ, ఆర్థిక అంతరాలు లేవు. కానీ ప్రజల ఆర్థిక స్థితిగతులను చితికిపోయేట్లు చేసిన ఆర్థిక మాంద్యం ప్రజల మధ్య చెప్పలేనన్ని తేడాలను సృష్టించింది. ఆ చీలిక ఈ ఎన్నికలలో స్పష్టంగా కన్పించింది. ఈ ఎన్నిక అమెరికన్ సమాజాన్ని ఎంతగా చీలికలు పీలికలు చేసిందో ఈ క్రింది పట్టిక చూస్తే అర్థమై పోతుంది.

| | ఒబామా | రోమ్ని |
|---|---|---|
| యువతీ యువకులు | 60 | 37 |
| నల్లజాతి ప్రజలు | 93 | 7 |
| తెల్లజాతి ప్రజలు | 39 | 59 |
| హిస్పానిక్ అమెరికన్లు | 71 | 27 |
| ఆసియా జాతి ప్రజలు | 73 | 26 |
| 50వేల డాలర్ల లోపు | | |
| రాబడి కల్గిన వారు | 60 | 38 |
| అధిక రాబడి కల్గినవారు | 44 | 54 |
| గ్రామీణులు | 39 | 59 |
| నగరవాసులు | 62 | 36 |
| క్యాథలిక్స్ | 50 | 48 |
| ప్రొటెస్టెంట్లు | 42 | 57 |

### ప్రభావితం చేసిన అంశాలు

ఈ ఎన్నికలను ప్రధానంగా ప్రభావితం చేసిన అంశాలు ఐదు. నిరుద్యోగం, పన్నుల పెంపకం, ఒసామా బిన్ లాడెన్, జార్జి బుష్, ఆరోగ్య పథకాలు.

ఆర్థిక మాంద్యం వల్ల అమెరికన్ యువతలో నిరుద్యోగం పెరిగిపోయింది. దాదాపు నాలుగు కోట్ల మంది నిరుద్యోగంతో కానీ లేదా చాలీ చాలని జీతంతో కానీ సతమతమౌతున్నారు. వారిలో ఉద్యోగాలు దొరుకుతాయనే ఆశ రగిలించడం ఒబామా విజయ సూత్రాలలో ప్రధానమైనది. ఓహాయో రాష్ట్రంలో మూతపడిన జనరల్ మోటార్స్ కార్ల ఫ్యాక్టరీని ప్రభుత్వ ఆర్థిక సాయంతో తెరిపించడం ద్వారా ప్రజలలో నమ్మకం కల్గించాడు ఒబామా. ఒసామా బిన్‌లాడెన్‌ను నిశ్శబ్దంగా చంపగలగడం ఒబామా ప్రతిష్ట పెంచింది. ఇరాక్ నుంచి సైన్యాన్ని వెనక్కు పిలవడం ద్వారా శాంతి ప్రియుడిగా పేరుపడిన ఒబామా, ఒసామాను అంతం చేయడం ద్వారా ఆఫ్ఘనిస్తాన్ యుద్ధానికీ ముగింపు పలుకుతాడన్న విశ్వాసం కల్గించగలిగాడు. అమెరికన్ ప్రజలు తమ సొత్తుతో ఇతర దేశాలలో జరిపే యుద్ధాల పట్ల చాలా విసిగిపోయి వున్నారు. ఎవరి కోసమో తమ బిడ్డలను బలిపెట్టడం ఏమిటని యుద్ధాలలో మరణించిన సైనికుల తల్లితండ్రులు ప్రభుత్వాన్ని నిలదీస్తున్నారు.

### బుష్ భూతాన్నీ చూపాడు!

ప్రజలను ఆకర్షించడానికి మాజీ అధ్యక్షుడు జార్జి బుష్ చేసిన తప్పులను పదే పదే జ్ఞాపకం చేశాడు ఒబామా. బుష్ రిపబ్లికన్ పార్టీ నాయకుడు. ఆయన కాలంలోనే ఇరాక్ యుద్ధం, వరల్డ్ ట్రేడ్ సెంటర్ భవనాల పతనం వంటివి జరిగాయి. ఆయన అనుసరించిన అపసవ్య విధానాల వల్లనే అమెరికన్ ఆర్థిక వ్యవస్థ నాశనమైపోయిందని, రిపబ్లికన్లకు మళ్లీ అవకాశం ఇస్తే జార్జి బుష్ వంటి వారు పుట్టుకొస్తారని ఒబామా చేసిన ప్రచారం ప్రజలను ఆకట్టుకొన్నది.

అమెరికన్ ప్రజల కుటుంబ ఖర్చులూ సింహ భాగం ఆరోగ్య బీమా పథకాలకు ఖర్చై పోతుంది. పేద వారికి తక్కువ ఖర్చుతో ఆరోగ్యం అందించాలని ఒబామా ప్రవేశపెట్టిన పథకాలు మధ్యతరగతి ప్రజలను బాగా ఆకర్షించాయి. 26 సంవత్సరాలు వయస్సు వచ్చేవరకు పిల్లలను కూడా కుటుంబ ఆరోగ్య బీమా పథకం క్రిందనే పరిగణించాలని ఆయన చేసిన శాసనం దిగువ, మధ్యతరగతి వారికి వర ప్రసాదం వలె కన్పించింది.

2008లో అమెరికన్ అధ్యక్షుడిగా ఒక నల్ల జాతి యువకుడు ఎన్నిక కావడం ప్రపంచాన్నే ఆశ్చర్య పరచిన విషయం. ఆ ఘనతను కొనసాగించుకోవాలన్న నల్లజాతి ప్రజల ఆకాంక్ష ఒబామాకు బాగా ఉపకరించింది. నల్లజాతి ప్రజలలో నూటికి 95 శాతం మంది ఒబామాకు ఓటు వేశారు.

అమెరికన్ సమాజం ఎన్ని రూపాలలో చీలిపోయిందీ దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు. అమెరికన్

కొరవ 9వ పేజీలో







Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com